ప్రేమ్‌చంద్ —

# ప్రేమపీఠం

అనువాదం :

మువ్పన విశ్వప్రసాద్


ప్రకాశకులు :

ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్

9/225, వెలగలేటివారి వీధి

కొత్తపేట :: విజయవాడ.

# ప్రేమపీఠం

5

## మొదటి దృశ్యం

(ఒక బంగళావంటి యిల్లు. ఎదురుగా వరండా వుంది. దానిలో గుండ్రని యిటుకల స్తంభాలున్నాయి. వరండాలో రెండు మూడు మూటలు అడ్డదిడ్డంగా పడివున్నాయి. వరండాకు వెనుక మూడు గుమ్మాలుగల ఒకగది వుంది. ఆ గదికి రెండు వైపుల రెండు గదులున్నాయి. అనేకచోట్ల తూట్లుపడిన జంపఖానా గదిలో పరచబడి వుంది. గదిలో ఒక గుండ్రని టేబిలు, దానిపైన గుడ్డ, వాడిన పూలతోనున్న పూలకూజా వున్నాయి. ఐదు బెత్తెపు కుర్చీలు వున్నాయి. వాటిమీద చినిగి, మాసిపోయిన తలగడలు వున్నాయి. గోడలకు క్రైస్తవ ధర్మ సంబంధమైన అనేక చిత్రాలు ధూళిపట్టి వున్నాయి. ఒకవైపు కేలండరు, మరొకవైపు ఒక పెద్ద సీసా వుంది. కుడివైపు గదిలో రెండు బెత్తెపు మంచాలు విరిగి వున్నాయి. ఎడమవైపు గదిలో ఒక పియానో ఒక కుర్చీ వుంది. గది వెనుక గోడకు లోపలకు వెళ్ళే ఒక ద్వారం వుంది. లోపల ఒక చిన్న వాకిలివుంది. వాకిలిలో మురికి నీరుపోయే చిన్న కాలువ. కోళ్ళగూడు లున్నాయి. ఒకమూల వంటగది, మరొక మూల స్నానాలగది వున్నాయి. అన్ని గుమ్మాలకు మాసిపోయిన తెరలు వేలాడబడి వున్నాయి.

మిస్ జేనీ ఎడమవైపు గదిలో, కుర్చీలో కూర్చొని పియానో వాయిస్తుంది. ఆమె వయస్సు 18_20 సంవత్సరాలుండొచ్చును. శ్యామవర్ణం, పెద్ద పెద్ద కళ్ళు, నాజూకయిన గులాబిరంగు చీర పారసీ ఫేషనులో కట్టింది. ఉనికినిబట్టి సామాన్య క్రైస్తవ కుటుంబానికి చెందిన దానిలా కన్పిస్తుంది. పర్నీచరు, జంబఖానా అన్నీకూడ బజారులోదొరికే సామాన్య వస్తువుల్లాగే వున్నాయి.

మిస్ జేనీ పియానో వాయిస్తూ పాడుతుంది:—
"మీ స్మృతి పథంలో వుందో మరి, తొలగిందో అది. ఒక సువర్ణ సమయం మీరు, మేము ప్రేమమయం......"

మిసెస్ గార్డన్ కళ్లు నులుపుకొంటూ లోపలనుంచి వస్తుంది. ఆమె నడిమివయస్సుగల స్త్రీ. అందమయింది. తల వెంట్రుకలు చెదరి ముఖంలో విచారరేఖలు ఆవరించివున్నాయి. మాసిపోయిన పట్టువేసుకొంది; కాని అది ఆమె దుర్బల శరీరం మీద యింపుగా లేదు.)

మిసెస్ గార్డన్ :_ ఈ రోజు విలియం రావచ్చు, నువ్వు యింకా యిలాగే కూర్చున్నావు !

జేనీ :_ అయితే ఏం చెయ్యాలి ? నాట్యం చేయాలా ? డోలు వాయించాలా ?

మిసెస్ గార్డన్ :_ యిలాగేనా అతిథుల్ని సత్కరించడం ? యింకా 'మేకప్' అయినా చేసుకోలేదు; ముఖంకూడ కడుక్కోలేదు.

జేనీ :- అతనికి నాకు కుదరదని చెప్పానుగా ? మీరు అనవసరంగా ఆయన్ను వెనకేసుకొస్తున్నారు.

మిసెస్ గార్డన్ :- అమ్మాయ్ ! నువ్వు అప్పుడప్పుడు యింటి విషయాలు అసలు తెలియనట్లుగా మాట్లాడుతుంటావ్. విలియంలో ఏం లోపముందో కొంచెం చెప్పు. 'అతనికి నాకు కుదర'దనడం కూడ ఒక మాటేనా ? యవ్వనంలో వున్న యువకుడు, ఆకృతికూడ అంత వికృతిగా లేదు; చిరునవ్వు లొలికించే అందమైన ముఖం. మంచి ప్రవర్తన కలవాడు, ఉత్తమ శీలుడు, త్రాగుడు లేదు, మరే యితర వాంఛలు లేవు – మరి, యింతకంటే, నీ కింకెటువంటి మనిషి కావాలి ? నాలుగు డబ్బులు సంపాదిస్తున్నాడు; యింటిలోకూడ ఏదో కొంత ఆస్తి వుంది, యింకా మనిషికి మరేమి కావాలి ? షోకేలా కాదు-యిదేగా లోపం? దీనినే నువ్వు ఏదో లోటుగా భావిస్తున్నావు; కాని నేను దీనిని ఒకరకమైన 'కళ' అంటాను. జేనీ ! నేను నిజం చెబుతున్నాను; నాకు యింత వయస్సు లేకుంటే అతనిని తప్పక వివాహం చేసుకొనేదానిని. మీ 'పప్పా' చనిపోయి ఐదు సంవత్సరాలయింది. చేతుల్లో ఉన్నది కాస్త అయిపోయింది. యిప్పుడెలా జరగడం? నువ్వు 'గ్రాడ్యుయేట్'వయ్యావు. నిజమే కాని, ఎంత ప్రయత్నించినా వంద రూపాయిల కన్న పెద్దనౌకరీ నీకెక్కడ దొరుకుతుంది ? మీ పప్పా ఐదువందలు తెస్తుండేవారు. ఏదో కాలం గడుస్తుండేది, నాలుగు డబ్బులు కూడ వుండి పోయేవి. విలియం ఆదాయంకూడ నాలుగైదు వందలకు తక్కువ వుండదు. స్త్రీ

తన జీవితాన్ని గడుపుకోడానికి వుద్యోగం చేయడంకూడ మంచిదికాదు. యిదిమాత్రం నాకు నచ్చదు. నాకు వందరూపాయిల వుద్యోగం దొరికేది. కాని మీ పప్పా ఒప్పుకోలేదు.

జేనీ :- నేను వివాహంచేసుకోనని మీతో చెప్పానుగా!

మిసెస్ గార్డన్ :- అసలు ఎందుకని ? అదే అడుగుతున్నాను.

జేనీ:- ఒక పురుషునికి బానిసగా వుండటం యిష్టంలేక.

మిసెస్ గార్డన్:- వివాహం చేసుకోవడం బానిసత్వమా? పెళ్ళిచేసుకొన్న స్త్రీలంతా బానిసలేనా ?

జేనీ :- బానిసలు కాక మరేమిటి? రాణు లుంటారు, వారుకూడ బానిసలే; కూలి వాళ్ళుంటారు, వారుకూడ బానిసలే. పేరు-ప్రతిష్టలు, ధన-సంపత్తులు వుండేది పురుషుని ప్రపంచం. నలిగి, కరిగి, కృంగిపోవడం స్త్రీ ప్రపంచం. ప్రతి పనిలోను స్త్రీ పురుషుని అనుమతి తీసుకోవాలి. ఆమె నాలుగు డబ్బులు ఎక్కువ ఖర్చు చేస్తే పురుషుని ఆగ్రహానికి హద్దు వుండదు. పురుషుని ఆహారం కొంచం ఆలస్యమయితే, స్త్రీ నెత్తిమీద ఆపద వచ్చిపడుతుంది. ఒకవేళ, స్త్రీ పురుషుని అడగకుండా ఎక్కడికైనా వెళ్ళితే పురుషుడు ఆమెను చంపడానికి సిద్ధమవుతాడు. ఏవ్యక్తితోనైనా నవ్వుతూ మాట్లాడితే, ఆమె బ్రతుకు బ్రద్దలవుతుంది. పైకిమాత్రం పురుషుడు స్త్రీని ఎంతో గౌరవిస్తాడు. కారులో స్త్రీకి ప్రత్యేక స్థానమిస్తాడు. ముందు పురుషుడే నమస్కారం చేస్తాడు. స్త్రీ ఓవరు కోటు

పురుషుడు సర్దుతాడు; స్త్రీని చెయ్యిపట్టుకొని బండిలోంచి దింపుతాడు; ముందు స్త్రీని కూర్చోబెట్టి తను కూర్చుంటాడు—కాని, యివన్నీ నటనాచారాలు. స్త్రీయొక్క స్వాతంత్ర్యాన్ని లాక్కొన్నానని పురుషునికి బాగా తెలుసు. అందుచేతనే స్త్రీ ఆత్మస్వాతంత్ర్యాన్ని పూర్తిగా మరచిపోడానికే పురుషుడు స్త్రీని యింతగా గౌరవిస్తూంటాడు.

మిసెస్ గార్డన్ :- నీ ఆలోచనలు చాల విచిత్రమైనవి జేనీ !

జేనీ :- విచిత్రమైనవి కావు, యదార్థమైనవి. మనం మన 'టామీ'ని ఎంత గౌరవిస్తున్నాము ? బండిలో దానిని దగ్గర కూర్చోబెట్టుకొంటున్నాము, ఎత్తుకొంటున్నాము, కౌగలించుకొంటున్నాము, సబ్బుతో స్నానంచేయిస్తున్నాము; కాని, అది 'కుక్క' అనే భావం మన హృదయంలో స్థిరంగా లేదా ? అది మన మనస్సుకు విరుద్ధంగా ఏమైనా చేస్తే 'హంటర్' వుపయోగిస్తాము. పురుషుడు వివాహం చేసుకొని స్త్రీకి యజమాని అవుతాడు. స్త్రీ వివాహం చేసుకొని పురుషుని దాసిగా తయారవుతుంది. స్త్రీ, పురుషుని సంతోషపెడుతూ, అతని సౌంజ్ఞమీద నాట్యం చేస్తుంటే; కావలసినన్ని రూపాయిలు, వస్తువులు, శిల్కు బట్టలు—ఆమెకోసం ప్రాణాన్ని కూడ పళ్లెంలో పెడతాడు; హృదయాన్ని అర్పిస్తాడు. కాని, స్త్రీ కొంచెం స్వేచ్ఛను ప్రకటించినా, కాస్త ఆత్మగౌరవాన్ని వెలిబుచ్చినా, పనికిరాదు — కులటయిపోతుంది, ఆమెను పురుషుడు క్షమించలేడు. పురుషుడు ఎంత చెడ్డవాడయినా,

స్త్రీ నోరు విప్పలేదు; పురుషుడ్ని దైవంగా భావించడం ఆమె ధర్మం. దీనిని నేను సహించలేను.

మిసెస్ గార్డన్ :- నీ మాటల్లో చాలవరకు సత్య ముందని నే నొప్పుకుంటాను; కాని, కాలం గడవటానికి ఏదైనా మార్గం ఆలోచించాలి.

జేనీ :- నేనుమాత్రం నిశ్చింతగా వున్నాననుకొన్నా వా? అలా ఎప్పుడూ అనుకోను. ఏ స్కూలులోనో ఒక వంద రూపాయిలకు టీచరుగా వుంటాను. ఒక వేళ అదృష్టం బాగుంటే, రకరకాలుగా, విలియం తన స్వప్నంలో కూడ చూడనంత ధనం సంపాదించి చూపిస్తాను.

(మిస్ ఉమ వస్తుంది. చాల అందమయినది. పసుపు కుంకాల వలన ఆమె వివాహిత స్త్రీలా కన్పి స్తుంది. ఆమె గుండ్రని మణికట్టుకు రత్నాల గాజు లున్నాయి. మెడలో రత్నాల హారం వుంది. బహు మూల్యమైన బనారసు చీర కట్టింది. "ప్రపంచంలో వసంతమే వసంతం; పువ్వులే పువ్వులు" అన్నట్లుగా అతి పులకిత వదనం.)

జేనీ :- (కుర్చీమీదనుండి లేవకుండా) మొదట్లో నేను కుర్చీమీదనుంచి లేచి, నిన్ను గౌరవించేదానిని; కాని ఈరోజు లేవను. నా దృష్టిలో నువ్వు పూర్వంలా లేవు.

ఉమ :- ఏం? నేను మారిపోయానా?

జేనీ :- నిస్సందేహంగా. ముందు నువ్వు స్వతంత్ర కుమారివి, యిప్పుడు ఒక పురుషుని దాసివి.

ఉమ :- అయినా, నీ స్నేహితురాలిని. నీతోనే చదివాను; నీతోనే ఆడుకొన్నాను. నాఅంతస్సునుండి పడిపోయినా, నాకు దుఃఖం కలుగకుండా వుండడానికి నువ్వు సత్కరించాలి.

జేనీ:- కాని, నీకు ఏదైనా ఆపదవచ్చివుంటే—భగవంతుడు చేయకుండుగాక — నీ కాళ్ళ క్రింద నా శిరస్సు వుంచేదానిని; కాని, నువ్వు తెలిసివుండికూడ కాళ్ళకు సంకెళ్ళు తగిలించు కొన్నావు. నీ స్వాతంత్ర్యాన్ని, నీఆత్మను; బంగారానికి, శిల్పకు అమ్ముకొన్నావు.

ఉమ :- (నవ్వి) నిజం చెప్పు; నేను మొదటికంటె ఎక్కువ అందంగా కన్పిస్తున్నాను కదూ !

జేనీ :- నీ భర్త కళ్ళకు కన్పించవచ్చు. నా కళ్ళకు మాత్రం నీ రూప లావణ్యం, ఈ బంగారం - శిల్పాల క్రింద అణగిపోయినట్లు తోస్తుంది.

ఉమ :-చూడు, ఈగాజులు ఎంతనాజూగ్గావున్నాయో!

జేనీ :- (ముఖం త్రిప్పుకొని) బానిసత్వపు సంకెళ్లు.

ఉమ :- ఈ హారం చూడు, వజ్రాలు కూర్చారు !

జేనీ :- బానిసత్వపు బంధన.

ఉమ :- (కొంచెంకోపంగా) నువ్వు బానిసత్వపుసంకెళ్లు బంధనలు అని అంటుండే వాటినే, నేను వ్రత, కర్తవ్య, ఆత్మసమర్పణల చిహ్నాలుగా భావిస్తున్నాను.

జేనీ :- ఆ వ్రతము, ఆ కర్తవ్యము, ఆ ఆత్మసమర్పణ ఒక వయిపే ఎందుకున్నాయి ? కేవలం నీకే ఈచిహ్నాల అవసరమేమిటి ? నీ భర్తకెందుకు అక్కరలేదు ? అతనికి గాజులు

లేవు, కంకణాలు లేవు, మెళ్ళోహారం లేదు, నుదుట కుంకుమ బొట్టయినా లేదు; ఎందుచేత ? నీవ్రతం స్థిరంగా వుండడానికి బంధాలుండాలి, ఆతనికి అవసరం లేదా ?

(ఉమ మాట్లాడలేక, సహాయం కోసం మిసెస్ గార్డన్ వంక చూస్తుంది.)

ఉమ :- మమ్మీ ! వింటున్నారా జేనీ మాటలు ?

మిసెస్ గార్డన్ :- యిది చాల తప్పు. శుద్ధమూర్ఖత్వం.

జేనీ :-(విజయభావంతో) సమాధానం చెప్పకూడదా ? నీ భర్త ఈ బంధాల్ని ఎందుకు స్వీకరించడం లేదు ? నీకే ఈ సంకెళ్ళు అవసరమని ఎందుకు భావించ బడింది ? కర్తవ్యము, ప్రేమ నీతోపాటు అతనికి కూడ వుండనక్కరలేదా ? నీకు, నీ కర్తవ్యాన్ని జ్ఞాపకం చేయడానికి చిహ్నాలుండాలా ? అతనికి అక్కరలేదా ? నువ్వు బానిసవు, అతను స్వతంత్రుడు—ఇంత కంటె దీనికి మరొక కారణ మేముంటుంది ?

ఉమ :- (ఒకఆలోచనతట్టి) పురుషుడు తనకర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేస్తే, స్త్రీకూడ చేయాలా ? పురుషుడు తన వ్రతాన్ని లక్ష్యపెట్టక, ఆత్మను మరచిపోతే, స్త్రీకూడ మరచి పోవాలా ? స్త్రీ కుటుంబానికి ముఖ్యాంగం కనుక — శూద్రులకు ఏ చిహ్నం అవసరం లేకపోయినా, బ్రాహ్మణులకు యజ్ఞోపవీతం అనివార్య మన్నట్లు, స్త్రీకి బంధనల ఆవశ్యకత చాల వుందని నా అభిప్రాయం.

జేనీ :- నీ అభిప్రాయం బలహీనంగావుంది. అసలు విషయం చెబుతాను విను ! పూర్వం పశువులు, ధాన్యము,

యిల్లువలె స్త్రీ కూడ పురుషుని సంపత్తిగా భావించ బడేది. ఇప్పటిలాగే అప్పుడుకూడ ఆ స్త్రీమీద అక్రమాలు, దోపిడీలు జరుగుతుండేవి. సాధారణంగా బాలిక అతి విలువగల సంపత్తిగా భావించ బడేది. అందుచేత అమెకు యుక్తవయస్సు వచ్చేసరికి, ఆమెకోసం దోపిడీలు మొదలయ్యేవి. పురుషుడు తన వీరుల్ని తీసుకొని అస్త్ర శస్త్రాలతో, బాలికను వెంబడించేవాడు. యిరువైపుల భయంకరమైన యుద్ధం జరిగేది. రక్తపు నదులు ప్రవహించేవి. బందిపోటు దొంగలు విజయాన్ని పొందితే, బాలికతో పాటు, యింట్లోవున్న సంపత్తినికూడ దోచుకొనే వారు. బాలికయొక్క బంధు మిత్రులంతా ఏడ్చి వూరుకొనే వారు. ఆ సంగ్రామానికి స్మృతి చిహ్నంగా, ఆమె నుదుట రక్తపుబొట్టు పెట్టేవారు. దానివలన తనుపారిపోవడానికి ప్రయత్నిస్తే, తన బంధుమిత్రులకు కలిగిన పరిస్థితే, తనకుకూడ సంభవిస్తుందని ఆ బాలిక తెలుసుకొనేది. కన్యకు ఎప్పుడూ బంధువులు జ్ఞాపకం రాకుండా వుండేందుకు, ఈక్రొత్తభర్తనే సర్వస్వంగా భావించేందుకు "భర్తే నీ స్వామి, నీ దేవత; అతన్ని సంతోష పరిస్తేనే నువ్వు స్వర్గానికి వెళతావు" అని వుపదేశించేవారు. యిదే ఈ చిహ్నాల అర్థం. ప్రస్తుతం ఆ బంధనాచారాల రూపంలో కొంత మార్పు కలిగినా, మూలం మాత్రం అదే. నూతన సంస్కృతి కొంతవరకు పరివర్తన తెచ్చినా, పురుషుల అభిప్రాయం యిప్పుడుకూడ అదే; సమాజ వ్యవస్థకు ఆధారం కూడ అదే; ముమ్మాటికీ అదే.

మిసెస్ గార్డన్:- యిది నీ బుద్ధి పూర్వకమైన కల్పనా? లేక ఎక్కడైనా చదివేవా ?

జేనీ :- యిదొక గొప్ప పారసీ తత్త్వవేత్త ఉద్దేశం.

మిసెస్ గార్డన్ :- అయితే, అతని బుద్ధి పాడైపోయి వుండొచ్చు; స్త్రీ పురుషులు—యిద్దరూ ఎవరి యిష్టప్రకారం వాళ్ళు అలంకరించుకొంటారు. స్త్రీ - పురుషుడిని; పురుషుడు_ స్త్రీని, ఆకర్షించుకోవాలనుకొంటారు. పురుషునిలో పశుబలం ఎక్కువ, స్త్రీలో బుద్ధిబలం అధికం. అందుచేతనే బయట కఠిన పరిశ్రమ, యుద్ధాలు పురుషుని వంతు; లోపలపని స్త్రీవంతు. పెద్ద పెద్ద రాజులు, ముత్యాల హారలను _ వజ్రాల కంకణాలను ధరించగా నేను చూశాను. అయినా ఒక్కొక్క దేశపద్ధతి ఒక్కొక్క విధంగా వుంటుంది. కూలీల భార్యలు చాల తక్కువ వస్తువుల్ని పెట్టుకొంటారు. యూరప్‌లోసాధారణంగా ఆభరణాలే ధరించరు. కేవలం పెద్దకుటుంబానికి చెందిన స్త్రీలు మాత్రం ఒకటి_రెండు వస్తువుల్ని పెట్టుకొంటారు. భారత దేశంలో వ్రేళ్ళగణుపులుకూడ వస్తువులతో నిండిపోతాయి. యిదంతా దేశ ఆచారం.

జేనీ :- పురుషుడు స్త్రీ మీద అధికారాన్ని సాగిస్తు న్నాడని మీరు ఒప్పుకొంటారా ?

మిసెస్ గార్డన్ :- ఒప్పుకోను. స్త్రీమీద అధికారం చలాయించే పురుషులుంటే; పురుషులను శాసించే స్త్రీలుకూడ వున్నారు. నేను స్వయంగా మీ 'పప్పా' మీద అధికారం

చలాయించే దానిని. నా అనుమతి లేకుండా ఆయన ఎక్కడకూ వెళ్ళేవారు కారు. ఆయన తిరిగి రావడంలో ఒక్క నిమిషం ఆలస్యమయితే చాల గొడవ పెట్టేదానిని. అయితే పురుషునిలో ఈ ప్రవృత్తి అధికమనే విషయం అంగీకరిస్తాను; కాని, పురుషుడు పశుబలంతో పాటు, బుద్ధిబలాన్నికూడ అభివృద్ధి పరచుకోవడమే దీనికి కారణం. మనము సోమరితనం వలన విలాసాలలో మునిగి, అన్ని విధాల పాడయిపోయాము. సమాజంలోని ఈ వర్తమాన అధోగతికి స్త్రీ పురుషు లిద్దరూ బాధ్యులే. కేవలం పురుషుల్ని దూషించడం అన్యాయం.

జేనీ:- పరస్త్రీ వైపు కన్నెత్తి చూడని పురుషుడు ప్రపంచంలో వుండడని నా అభిప్రాయం. సరే! నూటికి తొంభై తొమ్మిదిమంది పురుషులు వ్యభిచారులని మీరు ఒప్పుకొంటారు గదా?

మిసెస్ గార్డన్ :- కాని యిటువంటి మోసగాళ్ళకు బదులుగా మోసగత్తెలకుకూడ లోటు లేదు. పురుషులసంఖ్య అధికంగా వుండొచ్చు. కాని ఈ విధంగా వుండడానికి స్త్రీ సహజంగా బుద్ధిమంతురాలవడమే కారణమనుకోవడానికి వీలు లేదు; ప్రకృతి ఆమెను బంధించివుంచింది. సుఖ శాంతులతో జీవితాల్ని గడపాలనుకొనే స్త్రీ పురుషులు, ప్రేమానురాగాల వలన పరిపూర్ణులవుతారు. కామలాలసులయిన స్త్రీ పురుషులు కష్టాలతోను, విచారంతోను జీవితాల్ని నాశనం చేసుకొంటారు.

జేసీ :— మమ్మీ! పురుషుడు, స్త్రీని తనతో సమానంగా భావిస్తున్నాడని, ఆమెను ఏ విధంగాను అణచడం లేదని మీ అభిప్రాయం కదూ ?

మిసెస్ గార్డన్ :— అవును! జీవితంయొక్క నిజస్వరూపాన్ని అర్థం చేసుకొన్న పురుషుడు యిలాగే వ్యవహరిస్తాడు. విజ్ఞాన వంతులయిన దంపతుల్లో 'చిన్న - పెద్ద' అనే విచక్షణే వుండదు. స్త్రీ వలన పొరపాటు జరిగితే, పురుషుడు సర్దుకొంటాడు; పురుషుడు ఏదైనా తప్పుచేస్తే స్త్రీ నచ్చ జెప్తుతుంది. అన్ని విషయాలలోను యిద్దరు ఆనందాన్ని అనుభవిస్తారు. పురుషుడు చాల పవిత్రంగా వుంటాడని, ఆతని మనస్సు ఇతర స్త్రీలనుచూసి చలించదని; లేక వివాహిత స్త్రీలంతా పతివ్రత లనిమాత్రం నేను చెప్పడంలేదు. కాని వారు తమను నిగ్రహపరచుకోవలసి వుంటుంది. ఒక్కొక్కప్పుడు రహస్య ప్రేమ యొక్క తాపం వలన, దహించుకొని చనిపోవలసి వుంటుంది. ఒకవేళ నాకు నా భర్తకంటె రూపవంతునిచూసి కోరిక కలిగితే; నా భర్తకుకూడ నాకన్న గొప్ప సౌందర్యవతిని చూసి తృష్ణకలిగే అధికారం, సమాన రూపంలో వుంటుంది; కాని, ఈ విశ్వాసఘాతంవలన మా సుఖశాంతులకు భంగం కలుగుతుందని మే మిద్దరం తెలుసుకొంటాము. అందుచేత నిషేధిస్తాము. గౌరవ కుటుంబీయులు, విచారశీలురు అయిన స్త్రీ పురుషుల్లో ఈ భావమే కలుగదు.

ఉమ :— ( సంతోషంతో ) యిప్పుడు చెప్పు జేసీ ! మమ్మీ నీ నోరు అణచిందా లేదా ?

జేసీ :- హుఁ ! ఈపురాతన అభిప్రాయాలకే నా నోరు బంధింపబడేటట్లయితే, యిప్పటికే విలియంతో నా వివాహం అయివుండేది. ఏ వ్యక్తిత్వము, ఏ వుత్సాహము, ఏ ఆదర్శము లేని స్త్రీలు మాత్రమే వివాహం చేసుకోవాలని నా వుద్దేశము; కాని కొన్ని ఆదర్శాలు, కొన్ని కోరికలు, వ్యక్తిత్వము కలిగి, వేరు ప్రతిష్టలు సంపాదించాలనుకొనే స్త్రీలు అవివాహితలుగానే వుండాలి. స్త్రీ జీవితం భర్త జీవితంతో మిశ్రితం చేయడం ఎంత ఘన కార్యమైనా, నేనుమాత్రం చేయలేను.

(కారు హారను వినిపిస్తుంది)

ఉమ :- అదుగో! ఆయన వచ్చారు. ఆయనమూలంగా ఇంట్లోంచి బయటకు రావడంకూడ కష్టంగా వుంది.

(కారు గుమ్మందగ్గర ఆగుతుంది. యోగరాజు కారులోంచి దిగి, లోపల కొస్తాడు. ఉమ యిద్దరు స్త్రీలను పరిచయం చేస్తుంది.)

యోగరాజు :- మిస్ గార్డన్ యింటికి వెళుతున్నానని నాతో ఎందుకు చెప్పలేదు ? నేనుకూడ వచ్చేవాడినిగా !

ఉమ :- మీరు మీ మిత్రులకు నన్ను పరిచయం చేయలేదుగా ! నేనెందుకు చేయాలి?

యోగ :- నా మిత్రుల్లో నిన్నుచూసి, శత్రువులుకాని వారు వుండరు. నావిషయంలో మాత్రం నీకీ గొడవవుండదు.

ఉమ :- మీ మిత్రుల చంచలత వలన, మీకు కలిగిన భయం మిమ్మల్ని వారినుండి వేరుచేసిందా ?

యోగ :- లేదనుకో; కాని, నువ్వు చేశావు. (నవ్వుతాడు)

ఉమ :_ స్త్రీ వివాహం చేసుకొని, పురుషునికి బానిసవు తుందని, నా స్నేహితురాలు చెబుతున్నది. మీరు నన్ను బానిసగా చూస్తున్నారా ?

జేనీ :- (సిగ్గుపడి) యిది ఆతర్క సమయం కాదు ఉమ! మీరు మా అతిథులు. మిమ్మల్ని మర్యాద చేయాలి. టీ తీసుకురానా? (యోగరాజును పైనుంచి క్రిందవరకు అనురాగ నేత్రాలతో చూసి కళ్ళు దించుకొంటుంది.)

యోగ :_ వద్దండి. నేను టీ త్రాగేను. మీరు శ్రమ పడవద్దు.

జేనీ :- టీలో ఏమైనా మందు కలుపుతానేమోనని ఉమ భయపడుతూండవచ్చు.

యోగ :- ఏ మంత్రంతో నైనా నా మనస్సును కొంచెం మార్చితే మంచిదే. ఉమ నామీద ప్రయోగించిన వశీకరణం నుంచి కొంచెం విడుదలయినా లభిస్తుంది.

జేనీ :- ఉమవంటి ఉత్తమురాలిని పొందిన మీరుచాల అదృష్టవంతులు.

యోగ :- పూర్వ జన్మలో నేను గొప్ప తపస్సు చేసి వుంటాను.

ఉమ :_ మీరిద్దరు కలసి నన్ను పొగుడుతుంటే నేను వెళ్ళిపోతాను.

( జేనీ కళ్ళు, తిరిగి యోగరాజు కళ్ళతో కలుస్తాయి. ఆమె కళ్ళు దించుకొంటుంది, ఉమ జేనీని తీవ్ర నేత్రాలతో చూస్తుంది.)

యోగ :— (పియానో చూసి) ఓహో! మీకు పియానో సరదా కూడ వుందా? అయితే కొంచెంసేపు యిక్కడే కూర్చొని, సంగీత మాధుర్యాన్ని పొందా లనిపిస్తుంది. ఏం? మిస్ గార్డన్! మమ్మల్ని నిరాశ పరచరు కదూ!

జేనీ :— మీరు చాల వింతగా మాట్లాడుతున్నారండీ! రండి, ఏది కావాలంటే అదే వినిపిస్తాను.

(యిద్దరూ పియానో గదిలోకి వెళతారు.)

ఉమ :— (వ్యాకులతతో) అయ్యో! పాట - గీట ఆల కిస్తుంటే ఆలస్యమయిపోతుంది; అమ్మకు చెప్పకుండావచ్చాను. ఆమె కోప్పడుతుండొచ్చు.

జేనీ :— (చిరునవ్వు నవ్వి) అయితే, నువ్వు వెళ్ళకూడదూ? ఆయన కొంతసేపు నా సంగీతం విని వస్తారు.

ఉమ :— (సిగ్గుపడి) నాకు 'డ్రయివ్' చేయడంరాదు.

జేనీ :— అయితే కొంతసేపు కూర్చోకూడదూ? అమ్మ కొట్టదులే.

యోగ :— కాదు, మిస్ గార్డన్, యిప్పటికి క్షమిం చండి. ఈ గొడవ నామీద కొస్తుంది. తర్వాత ఎప్పుడైనా వస్తాను.

(యోగరాజు; జేనీ, మిసెస్ గార్డన్‌లతో కర స్పర్శ చేస్తాడు. ఉమ కూడ యిద్దరతో కరస్పర్శ చేస్తుంది.)

జేనీ :— రేపు రా ఉమ! ఆయనను కూడ తీసుకురా!

(ఉమ ఏమీ సమాధాన మివ్వదు. ఇద్దరు వెళ్ళిపోతారు.)

మిసెస్ గార్డన్ :- చాల మంచివాడు.

జేనీ :- ఇతన్ని చూడండి! మీ విలియంను చూడండి. మోటుతనం తప్ప, ముఖంలో శాంతిరేఖయినా వుండదు.

మిసెస్ గార్డన్ :- అమ్మా! అంతా ఒక్కలాగ వుంటారా? వీరు గొప్పకుటుంబీకులు. విలియం తండ్రి రైల్వే గార్డుగా వుండేవాడు. అయితే అతను కొడుకును, ఏదో కొంచెం చదివించాడు.

జేనీ :- అటువంటి పల్లెటూరి పశువును పెళ్ళిచేసుకో మంటారు.

మిసెస్ గార్డన్ :- నా దగ్గర ఒక పదివేలువుంటే, నేను కూడ యిటువంటి వరుడినే వెదికే దానిని. ఎంత బెల్లంవేస్తే అంత తీపి వుంటుంది.

జేనీ :- అందుకే వివాహం చేసుకోకుండా వుండాలని నిశ్చయించుకొన్నాను. ఉమ ఎంత ఈర్ష్యపడుతుందో మీరు చూశారా మమ్మీ?

మిసెస్ గార్డన్ :- యింకా క్రొత్త ప్రేమ కదూ!

జేనీ :- చూస్తూవుండు మమ్మీ! వీరికి సరిగ్గా పొత్తు కుదరదు. ఉమ చిన్న పిల్ల. యోగరాజు రసికుడు. ఒకటి రెండు నెలల్లో అతనికి ఆమెమీద మోజు తగ్గుతుంది.

మిసెస్ గార్డన్ :- కాదు జేనీ! ఇద్దరు జీవితాంతం వరకు సుఖంగా వుంటారు చూడు,

జేనీ :- సరే చూద్దాం. కాని, ఒక వ్యక్తి నా మెళ్ళో త్రాడుకట్టి, తన యిష్టంవచ్చినట్లు త్రిప్పడానికిమాత్రం నేను ఒప్పుకోను.

(మిసెస్ గార్డన్ వెళ్ళిపోతుంది. జేనీ పియానో మీద కూర్చొని పాడుతుంటుంది.)

"...అది ఒక సువర్ణ సమయం
మీరు మేము ప్రేమ మయం..."

( తెర )

# రెండవ దృశ్యం

( అదే యిల్లు. లోపల వంటగది. విలియం వంటింటి గుమ్మం దగ్గర స్టూలుమీద కూర్చొన్నాడు. మిసెస్ గార్డన్ వంట చేస్తుంటుంది. విలియం స్థూలంగా బలిష్టమైన శరీరంతో నల్లగా వున్నాడు. పెద్ద పెద్ద మీసాలు, వెడల్పయిన ఛాతీ—యువక సైనికునిలా కన్పిస్తున్నాడు. )

మిసెస్ గార్డన్:- నువ్వు ఎప్పుడైనా ప్రొపోజ్ చేశావా లేక ఆమె నిరాకరిస్తుందని ఊరకనే అనుకొన్నావా ?

విలియం :- నా మనస్సే సమాధాన మిస్తున్నది. స్త్రీలముందు పురుషుడు యింత 'మూగి' అవుతాడని నేననుకోలేదు.

మిసెస్ గార్డన్ :- మూగి కాదు, పిరికితనం. యింత పిరికితనం వుంటే, ఎప్పుడూ జయం కలగదు. నువ్వు చూస్తూ వుండగానే మరొక వ్యక్తి వచ్చి లాక్కొని పోతాడు.

విలియం :- ఆవిషయంలో భయంలేదు మిసెస్ గార్డన్! మరొకవ్యక్తి వస్తే అతని రక్తం, నా రక్తం ఏకం చేస్తాను. నేను జేనీని పొందలేకపోవచ్చు; కాని, నేను బ్రతికుండగా యితరు లెవరుకూడ అనుభవించలేరు.

మిసెస్ గార్డన్ :- మళ్ళీ అదే మోటుతనం! నువ్వు స్వయంగా ఎందుకు ప్రొపోజ్ చెయ్యడంలేదు ?

విలియం :- ప్రొపోజ్ చేసేది ఎలాగో అర్థం కావడం లేదు. ఎన్నో పుస్తకాలు చదివాను; కాని, స్పష్టంగా ఎందు లోను లేదు.

మిసెస్ గార్డన్ :- అమెను అప్పుడప్పుడు పార్కుకు-గీర్కుకు తీసుకెళ్ళు. అక్కడ ఏకాంతంలో ప్రొపోజ్ చేయ్. నేను యింకా ఏం చెప్పను ?

విలియం :- ఆమె నాతో ఎక్కడికైనా వస్తేగా ! నన్ను చూడగానే ముఖం ముడుచుకొంటుంది. లేచి వెళ్ళి పొమ్మంటుంది. ఎప్పుడైనా కొంచెం మర్యాదగా కూర్చొని మాట్లాడితే నా మనస్సుకుకూడ కొంత ఉత్సాహముంటుంది.

మిసెస్ గార్డన్:- అయితే, నువ్వు కాలమంతా యిలా వ్యర్థంగానే గడిపేవా ?

విలియం :- నా ప్రవేశపు హద్దు మీావరకే.

మిసెస్ గార్డన్ :- అయితే, నన్ను పెళ్ళి చేసుకొం టావా ? ఎంత అమాయకుడవు ! తెలివిగల పురుషుడు, స్త్రీని ఒక్క నిముషంలో లాక్కొంటాడు; కాని, సంవత్సరం గడుస్తున్నా, నువ్వు యింకా క, ఖ ల వరకుకూడ రాలేదు. నీలో కొంత చాతుర్యం, సామర్థ్యం వుంటే, నేనుకూడ బల వంతం చేస్తాను. యింతకూ, ఆమెను ఆకర్షించుకోడానికి ఏమైనా ప్రయత్నాలు చేశావా ?

విలియం :- ఇంగ్లీషు మాట్లాడటం బాగా నేర్చు కొన్నాను.

మిసెస్ గార్డన్ :- బాగుంది. కాని, నువ్వు ఇంగ్లీషులో ప్రొపోజ్ చేస్తావా ? లేక ఆమె నీ యింగ్లీషుభాషా ప్రవాహాన్ని చూసి మోహితురా లవుతుందా ?

విలియం :_ పాడటంకూడ నేర్చుకొన్నాను.

మిసెస్ గార్డన్ :- యిది కొంతవరకు బాగుంది. ఆమె చక్కగా పాడుతుంది. నువ్వూ నేర్చుకొన్నా నంటున్నావు. ఈ సమానత్వం రాను రాను స్నేహానికి దారి తీస్తుంది. పియానో వాయించగలవా ?

విలియం :- ఓఁ, బాగా వాయించగలను.

మిసెస్ గార్డన్ :- జేనీ స్నేహితురాలి యింటికి వెళ్ళింది. అప్పుడే రాదు. ఈ లోపుగా నువ్వు పియానో ఎలా వాయిస్తావో చూస్తాను పద.

( యిద్దరూ పియానోవున్న గదిలోకి వెళతారు. విలియం పియానోమీాద ఒక అర్థంలేని రాగం ఆలా పిస్తాడు. )

మిసెస్ గార్డన్ :- అబ్బ బ్బ బ్బ బ్బా ! యిదేనా నీపాట ! భగవంతుని ముఖంచూసి జేనీ ముందుమాత్రం పియానో ఎప్పుడూ వాయించకు. నీ ఆకారం చూసే ఆమె అసహ్యించు కొంటుంటుంది. ఈపాట వింటే పూర్తిగా చీద రించుకొంటుంది.

విలియం :- ఇప్పు డిప్పుడే నేర్చుకొంటున్నాను మిసెస్ గార్డన్! కొద్ది రోజుల్లో చూడండి.

మిసెస్ గార్డన్ :_ పోవయ్యా, పాట నేర్చుకోడానికి బయలుదేరావ్ ! సరే, యింకా ఏం నేర్చుకొన్నావ్ ?

విలియం :- టెన్నిస్ మొదలెట్టాను.

మిసెస్ గార్డన్ :_ అవునవును. యిది చాల అవుసరం. బాగా ఆడగలవా ?

విలియం :_ ఓఁ, చూపించమంటారా ?

మిసెస్ గార్డన్ :- టెన్నిస్ కూడ పియానోలాగే నేర్చుకోలేదు కదా !

విలియం :- లేదండీ, బాగా ఆడతాను. పెద్దపెద్ద వాళ్ళనే పట్టీకొట్టించాను.

మిసెస్ గార్డన్ :- నిజమా ! సరే, ఈ గదిలో నీ ఆట కొంచెం చూపించు.

( యిద్దరు గదిలోకి వస్తారు. మిసెస్ గార్డన్ మేకులనుంచి రెండు రేకెట్లు తీస్తుంది. యిద్దరు చెరొక రేకెట్ తీసుకొని ఎదురెదురుగా నిలబడతారు. విలియం 'సర్వ్' చేస్తాడు. మిసెస్ గార్డన్ బంతిని అతనివైపుకు త్రిప్పుతుంది. అతను బంతిమీదకు జోరుగా రాబోయి దొర్లుతాడు. తర్వాత సర్దుకొని నిలబడతాడు.)

మిసెస్ గార్డన్ :- యిదేనా నీ ఆట ! నువ్వు దీనిలో కూడ ఫేలయ్యావు. భగవంతుని ముఖంచూసి జేసీ ముందు మాత్రం ఆడకు.

విలియం :_ నేను పడిపోలేదు మిసెస్ గార్డన్ ! తొందరలో కొంచెం కాలు జారింది.

మిసెస్ గార్డన్ :- సరే! టెన్నిస్ సూటు తయారు చేయించావా ?

విలియం :- యిది నాకెవ్వరు చెప్పలేదే !

మిసెస్ గార్డన్ :- సెభాష్! ఈ లాంగ్ బూట్ వేసుకొనే టెన్నిస్ ఆడతావా ?

విలియం :- బూటువేసుకొంటే బాగా పరుగెత్తవచ్చు.

మిసెస్ గార్డన్ :- ఏం మనిషివయ్యా! ఏ ప్రపంచంలో వుంటున్నావో అర్థంకాదు. ముందు టెన్నిస్ సూటు తయారు చేయించి, తర్వాత ఆట ప్రారంభించు. ఈ కొయ్యలు లాంటి జోళ్లు, ఈ లాంగుకోటు తొడుక్కొని టెన్నిస్ ఆడకూడదు. జేసీ చూసిందంటే తప్పక హేళన చేస్తుంది.

విలియం :- ఆర్మీలో పనిచేసేవాళ్ళకు టెన్నిస్‌సూట్ అవుసరంలేదని లేడీ డగ్లస్ నాతో చెప్పిందే !

మిసెస్ గార్డన్ :- బాగానేవుంది. ఇకనైనా మనిషిలా వుండటం నేర్చుకో. ఈ అడివిమీసాలు తీయించేయి. స్త్రీ, పురుషుని మీసాలు చూసి ఆనందించే కాలం వెళ్ళిపోయింది. మెలి తిరిగిన మీసాలు చూస్తే నాకు ఎంతో ముచ్చటగా వుండేది. కాని యిప్పుడు కాలం మారిపోయింది. యిప్పటి స్త్రీలకు, పురుషుని ముఖంలో వెంట్రుకల గుర్తుకూడా లేకుండా శుభ్రంగా వుంటేనే ఎంతో యిష్టం.

విలియం :- అయితే, రేపే తీసేస్తాను. దీనికి డబ్బేమీ ఖర్చుకాదుగా !

మిసెస్ గార్డన్ :- సరే, ఏమైనా నాట్యం - గీట్యం నేర్చుకున్నావా? జేనీ నాట్యం చాల బాగా చేస్తుంది.

విలియం :- ఓం, నాట్యం చెయ్యడం నాకు ముందే వచ్చును.

మిసెస్ గార్డన్ :- అయితే, కొంచెం చూపించు.

(విలియం అక్కడే కోతిలా గెంతులు వేయ నారంభిస్తాడు. నాట్యం చేస్తుండగా, స్థూల శరీరాన్ని సర్దుకోవడంలో అతని ముఖాకృతి వికృతంగా తయారవుతుంది. అదిచూసి మిసెస్ గార్డన్ నవ్వలేక కడుపు పట్టుకొంటుంది.)

మిసెస్ గార్డన్ :- చాల్లేవయ్యా నీ నాట్యం! అడవి పంది ఆటలా వుంది. అబ్బ! ఈసమస్య పరిష్కరించబడేటట్లు లేదు. యింకా నీలో చాల లోపాలున్నాయి. ముందు వాటిని సవరించుకో. తర్వాత ధైర్యంచేసి, ఒక రోజు ప్రొపోజ్ చెయ్.

విలియం :- ఏవైనా లోపాలుంటే నేను సవరించుకొంటాను. కాని, ప్రొపోజ్ చెయ్యడమే చాల కష్టంగావుంది.

మిసెస్ గార్డన్ :- నేనొక మాట చెబుతాను-కొంచెం బ్రాంది త్రాగు.

విలియం :- వాగుడు ప్రారంభమయితే!

మిసెస్ గార్డన్ :- అలాకాదయ్యా! నోటినుంచి సువాసనవచ్చే మంచిరకం బ్రాంది కొద్దిగా త్రాగు; కాని, పల్లెటూరి వానిలా మాత్రం వాగకు. సభ్యతనేర్చుకో. బట్టలు కూడ పెద్ద మనుష్యుల్లా గుండాలి. కాలరు, టై, శిల్కువి

తీసుకో. కోటు బొత్తాలకు ఒకటి రెండు గులాబిపువ్వులు తగిలించుకో. ఈ మొరటు సరుకులు లేడీలకు నచ్చవు. నాజూగ్గా, అందంగా వుండే బెత్తం తీసుకో. ఈ డబ్బా గడియారానికి, గొలుసుకు స్వస్తి చెప్పు. బంగారు రిష్టువాచీ పెట్టుకో. మీ యింట్లో ఎంతమంది నౌకర్లున్నారు ?

విలియం :- నౌకర్లా ! నౌకర్ల అవసరమేమిటి ? ఒక ముసలి దాసి వుంది; ఆమె రొట్టి, మాంసం రెండు పూటలు వండుతుంది. ఉదయం రెండుసేర్ల పాలు నేనే పితికి, పచ్చివే త్రాగేస్తాను. యింక నాకు నౌకర్లెందుకు ? ఆఫీసునుంచి వచ్చి ఐదువందల దండాలు తీస్తాను. భోజనంచేసి పండుకొంటాను.

మిసెస్ గార్డన్ :- ఇలాగే వుండదలచుకొంటే, జేనీ మీద ఆశవిడచిపెట్టు. ఆమెకు 'బికారి' భర్తకాదు, 'జంటిల్ మేన్' భర్త కావాలంటుంది.

విలియం :- కాని, ఇంతవరకు నాకెవ్వరు చెప్పనేలేదు. యిప్పుడు మీరు సలహా యిచ్చారుగా ! యింక చూడండి ! ఎంత త్వరలో 'జంటిల్ మేన్'గా తయారయిపోతానో !

మిసెస్ గార్డన్ :- ఎంత లేదన్నా ఒక సర్వెంటు, ఒక వంటమనిషి, ఒక బంట్రోతు వుండేతీరాలి. వడ్డించేవారు వేరు. ఒక నౌకరు, ఒక చాకలి, ఒక తోటమాలినికూడ పెట్టు. నువ్వు జమీందారువని యింకెలా తెలిసేది ? యిప్పుడు కారు లేకపోయినా అంత బాధ లేదనుకో. కాని, ఒకటి రెండు సంవత్సరాల్లో దానిని కూడ ఏర్పాటు చేయవలసి వుంటుంది. ఆఁ, యింట్లో ఏమైన చిత్రాలున్నాయా ?

విలియం :- వున్నాయండీ! పత్రికల్లో అందంగా కన్పించిన చిత్రాలన్నీ ఫ్రేమ్ కట్టిస్తున్నాను.

మిసెస్ గార్డన్ :- సెభాష్ ! అయితే, నువ్వు గొప్ప కళాకారుడవన్నమాట ! సరే. ఎప్పుడైనా సినిమాకు వెళు తుంటావా ?

విలియం :- సినిమాకు వెళ్ళి నిద్ర ఎందుకు పాడుచేసుకోవాలి మిసెస్ గార్డన్ ! నాకు దానిమీద సరదా లేదు.

మిసెస్ గార్డన్ :- అయితే నువ్వు శుద్ధ పల్లెటూరివాడి వన్నమాట ! తినడం, పనిచేయడం, నిద్రపోవడం ఎరుగుదువు. 'సభ్యత' అంటే ఏమిటో నీకు తెలియనే తెలియదు.

(జేనీ వస్తున్నట్లు అలికిడి అవుతుంది. విలియం దొడ్డి గుమ్మం నుంచి నెమ్మదిగా జారుకొంటాడు.)

జేనీ :- ఈ రోజు ఉమ, అమె భర్త వెళ్ళిపోయారు మమ్మీ ! ఉమ చాల విచారించింది. నన్ను కౌగలించుకొని ఏడవ నారంభించింది. నాకు కూడ ఏడుపొచ్చింది. పాపం ! మళ్ళీ ఎప్పుడొస్తుందో.

మిసెస్ గార్డన్ :- వీళ్ళలో వెళ్ళేటప్పుడు ఏడ్వడం ఒక పెద్ద రోగం.

జేనీ :- మీకేమి తెలుసు మమ్మీ ! నాకుకూడ ఏడుపు వచ్చింది. మిమ్మల్ని విడచి వెళ్ళేటప్పుడు నాకుకూడ

ఏడుపు రావాలి. యోగరాజు సినిమా డైరక్టరు మమ్మీ! నెలకు 1500 రూ. జీతం.

మిసెస్ గార్డన్ :- బాగుందే! వయస్సుకూడ పెద్దది కాదు. ఎవరి అదృష్టం వారిది.

జేనీ :- అమెరికా, ఇంగ్లాండు వెళ్ళి వచ్చారు మమ్మీ! అమెరికాలో ఒక కంపెనీలో డైరెక్టరుగా వుండేవారు. ఎంతో మంది యువతులు వివాహం చేసుకోడానికి సిద్ధమయ్యారు. ఎంతోమంది లక్షలిస్తామన్నారు. కాని; ఆయన వివాహం ఉమతో ముందే నిశ్చయించారు. అందరిని నిరాశపరచారు. అక్కడ వుండేటప్పుడు నాలుగైదువేలు వస్తుండేవి. ఈ కళలో ఆయన మంచి నిపుణత కలవారు. ఉమ చాల అదృష్టవంతు రాలు మమ్మీ! నన్ను ఆయన తన కంపెనీకి రమ్మన్నారు. ముందు 1000 రూ. యిస్తారట!

మిసెస్ గార్డన్ :-(కుమార్తెను కౌగిలించుకొని) నిజమా!

జేనీ :- అవును మమ్మీ! నన్ను రమ్మని బలవంతం చేశారు. యింకా కొన్ని ఏర్పాటులు చేసుకోవాలని చెప్పాను. నాకు 500 రూ. చెక్కుయిచ్చి, కావలసిన వాటికి వినియోగించుకోమన్నారు.

మిసెస్ గార్డన్ :- అతను సరియైనసమయంలో మనకు సహాయంచేసినందుకు భగవంతునికి లక్షనమస్కారాలు. చాల మంచి మనిషిలా వున్నాడు.

జేసీ :- (కొంచెంసిగ్గుతో) ఉమ నాకు స్నేహితురాలు కాకుంటే, నన్ను యింతగా ప్రేమించకుంటే, ఒక్కసారి నా భాగ్యాన్నికూడా పరీక్షించుకొనే దానిని.

మిసెస్ గార్డన్ :- ఏమన్నావ్ జేసీ ? పెళ్ళి చేసుకొన్న పురుషునితోనా ?

జేసీ :- పెళ్లీ-గిల్లీ పిల్లల అట మమ్మీ! యిది కేవలం స్త్రీ పురుషుల హృదయ నిర్ణయం. దీనిలో ధర్మాన్ని యిమడ్చడం చాల మూర్ఖత్వం. నేను ఉమ అంతటి సౌందర్యవతిని కాకపోవచ్చు; కాని, ఆయన్ను నేను ఆకర్షించుకోగలిగినంత, ఉమ ఆకర్షించుకోలేదు. వివాహానికి ముందు, నాకు ఆయనతో పరిచయమయితే ఎంత బాగుండేది! నా పాట విని మత్తెక్కిపోయారు. నీతో యింకేమి చెప్పను మమ్మీ! ఆయన ఉమ భర్త - అందుకే విచారం. ఉమ సరళత, నిష్కపటంచూసి, ఆమెమీద జాలి, దయ కలుగుతుంది. ఆయనకు యితర స్త్రీల గాలికూడ సోకకూడదను కొంటుంది ఉమ.

మిసెస్ గార్డన్ :- (విచారంగా) జేసీ! నీ హృదయంలో ఈ కోరిక వున్నప్పుడు, ఆ కంపెనీకి వెళ్ళడం మంచిది కాదు జేసీ!

జేసీ :- మమ్మీ! మీరుకూడ నన్ను చిన్నపిల్లలా భావిస్తున్నారా ? నేను యోగరాజును హృదయపూర్వకంగా

ప్రేమిస్తున్నాను; కాని, ఈ భావాన్ని, ఒక శబ్దంలో కాని, సౌంజ్ఞతో కాని వెల్లడించలేకపోయాను. నేను యింత కృతఘ్ను రాలిని కాను మమ్మీ!

మిసెస్ గార్డన్:-భగవంతుడు నీ ఉద్దేశాలను పవిత్రంగా వుంచుగాక తల్లీ! యిదే సజ్జనుల ధనం. భగవంతుడు తలచు కొంటే, యితనికంటె, మంచి వ్యక్తిని ప్రసాదిస్తాడు నీకు. పద, భోజనం సిద్ధంగా వుంది.

(యిద్దరు భోజనం చేయడానికి వెళతారు.)

( తెర )

# మూడవ దృశ్యం

(వర్షాకాలంలో ఒక ప్రభాతం. మేఘాలు వ్యాపించివున్నాయి. ఒక అందమైన భవనం. గుమ్మాలకు అల్లిక తెరలు కట్టబడి వున్నాయి. ఉమ ఒక గదిలో మంచంమీద జారపడికూర్చున్నది. ఒక స్త్రీ ఆమె తలకు నూనె వ్రాస్తున్నది. ఉమ ముఖం కళావిహీనంగా వుంది. శరీరం వాడిపోయింది. ఆ గదికి తోటవైపుకు రెండు కిటికీ లున్నాయి.)

ఉమ :- (అద్దంవంకచూసి) యౌవ్వనం యింత అస్థిరమైనదని నేను వూహించనైనా లేదు. కళ్ళు విప్పగానే అదృశ్యమైన ఒక మధుర స్వప్నం లాగుంది. స్వర్గంలోని అప్సర్సలా విమానంలో కూర్చొని అంబరవీధిని విహరించాను. యిప్పు డా విమానంలేదు, ఆ స్వర్గంలేదు. సౌందర్య సంపదనంతా పోగొట్టుకొని, దయాభిక్షకోసం నిరీక్షిస్తున్నాను. ఏం చంపా ! ఆయన స్వభావంలో ఎంత మార్పు వచ్చిందో చూశావా ? నా దగ్గర కూర్చోవడమే ఆయనకు యిష్టం లేనట్లు తోస్తుంది.

చంప :- అలా అనకండి. బాబుగారు మీ తలదగ్గర కూర్చొని కన్నీరు పెడుతుండగా అనేకసార్లు చూశాను. నన్ను చూడగానే రుమాలుతో కళ్ళుమూసుకొని, బయటికి వెళ్ళిపోతుంటారు. మీరు యిక్కడ పడుకుని వుండగా ఆయన

గుమ్మందగ్గర తిరుగుతూంటారు. బహుశా, ఆయన రావడం వలన మీకు కష్టంగా వుంటుందేమో అనుకొంటారు.

ఉమ :- (అవిశ్వాసంతో) ఆయన రావడం వలన నాకు కష్టం కలుగుతుందా ? నేను యింతవరకు బ్రతికి వుండడానికి కారణం, ఆయన ప్రేమే చూప! ఆయన ప్రకాశమే నా జీవితాన్ని నిలబెడుతోంది; లేకపోతే ఈ జ్యోతి ఎప్పుడో ఆరిపోయేది.

( యోగరాజు లేడీడాక్టరుతో గదిలోకి వచ్చి, ఆమెను కుర్చీలో కూర్చుండబెట్టి, బయటకు వెళ్ళిపోతాడు.)

లేడీ డాక్టరు :- ఈ రోజు మీ ఆరోగ్యం బాగున్నట్లుంది.

ఉమ :- వుండొచ్చు; కాని, నాకేమీ భేదం కనుపించడంలేదు.

లే. డా :- రాత్రి నిద్దరపట్టిందా ?

ఉమ :- లేదండీ! రెప్పయినా పడలేదు.

లే. డా :- కొన్ని రోజులు పర్వతగాలి తగలాలని చెప్పాను. కాని, మీరు వినడంలేదు. కనీసం ఉదయం షికారుకైనా వెళ్ళడం మంచిది.

ఉమ :- మనస్కరించడం లేదు డాక్టరమ్మా! చనిపోయేదానికి, 'ఆరునెలలు ముందయితే నేమిటి వెనుకయితే నేమిటి' అనిపిస్తుంది.

లే. డా :- అలా అనకండి. మీరు త్వరలో ఆరోగ్యవంతులవుతారు. పర్వత ప్రదేశానికి వెళితే ఒకనెలలోనే ఆరోగ్యం చేకూరుతుంది. మిమ్మల్ని రేపుపంపమని ఆయనతో చెబుతాను.

ఉమ :- నన్ను ఒక్కర్తినే వెళ్ళమంటూరా? నేను ఒంటరిగా వుండలేను.

లే. డా :- అబ్బే! ఒంటరిగా వెళ్ళమని చెప్పడంలేదు. ఆయనకూడ మీతో వస్తారు.

ఉమ :- ఆఁ అయితే, నాకు యిష్టమే.

(లేడీడాక్టరు ధర్మామీటరుపెట్టి జ్వరం చూసి, చీటి వ్రాసియిచ్చి, వెళ్ళిపోతుంది. గుమ్మం దగ్గర యోగరాజు నిలబడి వుంటాడు.)

లే. డా :- ఈమె ఆరోగ్యం పాడయి పోతూవుంది. పర్వత ప్రదేశానికి తీసుకొని వెళ్ళడం మంచిది. మందులవలన పని జరుగుతుందని, యింతవరకు ఎక్కువగా బలవంతం చేయలేదు. కాని, పర్వతగాలి చాల అవసరమని తోస్తుంది.

యోగ :- అయితే, రేపే తీసుకెళతాను.

(యిద్దరు యోగరాజు గదిలోకి వచ్చి కూర్చుంటారు.)

లే. డా :- తప్పకుండా వెళ్ళండి. కాని, మీరు ఏమైనా కుపథ్యంచేస్తే, ఈమెను వొదలుకోవలసి వుంటుంది. మీవలనే పరిస్థితి యిలా పరిణమించింది. ఒక్క సంవత్సరంలో రెండు

గర్భపాతాలు. మళ్ళీ మూడో గర్భం! కోమల ప్రకృతిగల అమాయక బాలిక ఎంతని సహించగలదు! మీరు విజ్ఞానులు, ప్రపంచాన్నికూడ బాగా చూసివున్నారు; అందుచేత వివాహానికి ముందే ఈ విషయాన్ని గురించి తెలుసుకోవలసింది. మొదటిసారి గర్భపాతమయినప్పుడు కనీసం ఒక్క సంవత్సరం పాటు పుట్టింటికి పంపించి వుండవలసింది. ఈమెకు కాస్త దూరంగా వుండటం చాల అవసరం. కాని మీరు ఏమాత్రం లక్ష్యపెట్టలేదు. ఉమాదేవి మొదటవచ్చినపుడు నేనుచూశాను-వికసించిన గులాబిపువ్వులా వుండేది. ఒక్క సంవత్సరంలో ఎక్కడ చూసినా రక్తపు చుక్కయినా లేకుండా పోయింది. దీనికి మీరే బాధ్యులు.

యోగ :- లేడీ విల్సన్! భగవంతుని ముఖం చూసి నన్ను క్షమించండి. ప్రమాణం చేసి చెబుతున్నాను-నాకేమీ తెలియదు.

లే. డా :- అయితే, యిది ఎవరి దోషమంటారు? ఈతరాని మనిషి నదిలో దుమకడం ఎవరి తప్పు? స్వారీ చేయడం తెలియకుండా గుర్రాన్ని నడపడానికి ప్రయత్నించడ మెందుకు? ఉమాదేవి చిన్నపిల్ల. ఆమె ఈ విషయాన్ని గురించి ఏమీ చదువలేదు, ఎవరితోనూ సంప్రదించనూలేదు. మీరు 'భర్త' అని, మీ ఆజ్ఞను శిరసావహించడం తన కర్తవ్యమని మాత్రం ఆమెకు తెలుసు. మీ కాముకత్వం ముందు తలవంచి, విషబీజాన్ని నాటుకొంటున్నానని ఆమె కేమి తెలుసు? మీకుకూడ ప్రస్తుతం తెలియక పోవచ్చు;

కాని, త్వరలోనే దీని ప్రభావం కనిపించి తీరుతుంది. ప్రకృతి నియమాల్ని ఉల్లంఘించిన వారిని, అది ఎప్పుడూ క్షమించదు.

( యోగరాజు నిర్జీవ ప్రతిమలా కూర్చొంటాడు. లేడీ విల్సన్ టోపీ తీసుకొని, వెళ్ళి పోబోయే సరికి, తృళ్ళి పడతాడు. )

యోగ :- లేడీ విల్సన్ ! భగవంతుని ముఖంచూసి ఈమెను ఎలాగైనా రక్షించండి. జీవితమంతా మీ బానిసగా వుంటాను. నా సర్వస్వాన్ని తీసుకొని, కేవలం ఆమెను మాత్రం రక్షించండి.

లే. డా :- యోగరాజుగారు! చంటిపిల్లవాడిలామాట్లాడకండి. రక్షించడం నా స్వాధీనంలో వుందా ? శక్తివంచన లేకుండా ప్రయత్నించడం నా ధర్మం. దీనికి మించి నేనేమీ చేయలేను. ఎంతోమంది సోదరులు చేసేపనే, మీరుకూడ చేశారు. స్త్రీ అనేది వారికి కేవలం భోగయంత్రంలావుంది. వారు స్త్రీని ఎంతైనా బాధపెడతారు. ఆమెమీద ఏమాత్రం అయిష్టత కలిగినా శత్రువై కూర్చొంటారు. పాపం ! స్త్రీ భర్తను సంతోషపరచడానికి అన్నిటిని సహిస్తుంది. ప్రతిఇంటిలోను యివే చూస్తున్నాను. క్షయరోగాలు వ్యాపిస్తున్నాయంటే, ఎందుకు వ్యాపించవు? అయినా, కంగారు పడనక్కర లేదు. రేపు ఈమెను, పర్వత ప్రదేశానికి తీసుకెళ్ళి ధైర్యం చెప్పండి. లేకపోతే మీరు పశ్చాత్తాప పడవలసి వుంటుంది.

( లేడీ విల్సన్ వెళ్ళిపోతుంది. యోగరాజు ఉమ దగ్గరకు వస్తాడు. )

ఉమ :- ఏమిటండీ, లేడీ విల్సన్ నాకు తెలియకుండా రహస్యంగా చెబుతుంది ?

యోగ :- ఏమీలేదు. పర్వతప్రదేశానికి తీసుకెళ్ళమని, రేపే ప్రయాణం.

ఉమ:- అయితే, మాయింటికి ఒక ఉత్తరం వ్రాయండి. వాళ్ళను ఒక్కసారి చూడాలని వుంది. జేనీనికూడ కలుసుకోవాలని వుంది; ఆమెకుకూడ వ్రాయండి.

యోగ :- ఉత్తరం వ్రాయడం, వాళ్ళు రావడం—యిదంతా చాల ఆలస్యమవుతుంది ఉమ !

ఉమ :_ అయితే మీయిష్టం. కాని, చనిపోతే వాళ్ళను చూడలేనేమోనని !

(ఉమ కళ్ళనుంచి రెండు అశ్రుబిందువులు రాలుతాయి. యోగరాజు వంగి ఆమెశిరస్సును ముద్దు పెట్టుకొంటాడు.)

యోగ :- (గద్గదస్వరంతో) కాదు ఉమ ! భగవంతుని దయవుంటే, అక్కడనుంచి ఆరోగ్యవంతురాలివయి తిరిగి వస్తావు. అక్కడ జల వాయువుల ప్రభావం చాలగొప్పది.

ఉమ :_ (చంపతో) చాలు చంప ! బయటకు వెళ్ళు. మళ్ళీ పిలచిన తర్వాత రా.

(చంప వెళ్ళి పోతుంది.)

నా దగ్గరగా రా రాజా ! మన వివాహ మయి ఈ రోజుకు సరిగ్గా ఒక్క సంవత్సరం అయింది. ఈ వేళే మీరు

మూ యింటి కొచ్చారు. పెళ్ళివారు వస్తారని తెలియగానే, మిమ్మల్ని చూడాలని మేడపైకి ఎక్కాను. మీరు నన్ను చూడలేదు; కాని, నేను మిమ్మల్ని బాగా చూశాను. ఎంత త్వరలో సంవత్సరం పూర్తయింది! ఈ రోజు వార్షికోత్సవం చేస్తాను. మీరు ఆఫీసుకు వెళ్ళవద్దు. ఈ వేళ నా హృదయ భారం తగ్గినట్లుగా వుంది. మీతో తృప్తితీర మాట్లాడతాను. మీరు లేనప్పుడు ఇల్లు శూన్యంగా కన్పిస్తుంది. ఒక్కక్షణం మిమ్మల్ని చూడకపోతే హృదయారాటం ఎక్కువవుతుంది. ఈ రోజు నా గది పూలతో అలంకరిస్తాను. కాని... ...వద్దు. పువ్వుల్ని తుంచవద్దు. (తోటవంకచూసి) కొమ్మల నానుకొని ఎంత అందంగా వున్నాయి! తుంచితే వాడిపోతాయి.

(చంపను పిలుస్తుంది. ఆమెవచ్చి నిలబడుతుంది.)

చూడు చంప! కాశ్మీరు నుంచి తెప్పించిన నా క్రొత్త చీర తీసుకురా. ఒకసారికూడ కట్టుకోలేకపోయాను. ఈవేళ కట్టుకొంటాను. చూడు! మిగిలిన బట్టలు ఏ మాత్రం నలగ కూడదు. చీరకు కొంచెం 'సెంటు' కూడ రాయి. ఈ వేళ ఈయనదగ్గర బహుమతి తీసుకోవాలి.

(చంప వెళ్ళిపోతుంది.)

ఈరోజు నాకేమి బహుమాన మిస్తారో చెప్పండి! మంచి వస్తువు యివ్వాలి.

యోగ :_ (గద్గద స్వరంతో) ఏమి కావాలి ఉమ! నాదగ్గరున్నదంతా నీది కాదూ?

ఉమ :- (నవ్వి, అతని మెడకు చేతులు తగిలించి) కాదు రాజా! యివేమీ నాకక్కర లేదు. నేను అడిగినదే యివ్వాలి.

యోగ :- నీకోసం నా ప్రాణాలుకూడ సిద్ధంగా వున్నాయి ఉమ!

ఉమ :- మీ రొక వాగ్దానం చెయ్యాలి.

యోగ :- యిదేమీ ఒక కానుకే కాదే!

ఉమ :- ఔను, నాకు వాగ్దానమే కావాలి. దానిలో నాకు కలిగే ఆనందం మరొక వస్తువులో లభించదు. నేను చనిపోతే, నా కుంకుమబరిణెమీద ప్రతిరోజు రెండు పువ్వులు వేస్తానని వాగ్దానం చెయ్యండి. ఆకుంకుమే నాకు మీ ప్రేమను ప్రసాదించింది. మీరు తప్ప, నాకీ ప్రపంచంలో దానికన్న ప్రియమైనది మరొకటి లేదు. దానిని తప్పకుండా జ్ఞాపక ముంచుకోండి.

(యోగరాజు ముఖం త్రిప్పుకొని, రుమాలుతో కన్నీటిని తుడుచుకొంటూ, బయటకు వెళ్ళిపోతాడు. ఒక నిమిషంవరకు ఎదురుగా వున్న అశోకవృక్షంక్రింద నిలబడి వెక్కి-వెక్కి ఏడుస్తాడు. తిరిగి ఉమ పిలుపు విని గుమ్మంవైపుకు వెళతాడు. కాని, అశ్రుప్రవాహాన్ని ఆపలేక గుమ్మందగ్గర ఆగిపోతాడు.)

( తెర )

# నాల్గవ దృశ్యం

( జేసీ యిల్లు. సంధ్యాసమయం. విలియం మీసాలు తీయించుకొని, టెన్నిస్‌సూటు ధరించి, చేత్తో ఒక రేకట్ పట్టుకొని, నిషాలో తూలుతూ వస్తాడు.)

జేసీ :— ( విలియంను చూసి ) ఈవేళ క్రొత్తవేషం వేశావే ! మీసాలు తీయించుకోమని ఏ గాడిద చెప్పింది నీకు ? నపుంసకుడిలా వున్నావు. నీమీదబట్టు. నీకేమిరోగం పుట్టింది —— అందంగా వుండే మీసాలు తీయించుకొన్నావ్ ? కొంచెం అద్దంలో నీ ఆకారం చూసుకో. అసలే తమరు అత్యంత రూపవంతులు! పైగా మీసాలుకూడ తీయించు కొన్నారు. భలే, భలే ! శుద్ధ పశువులా తయారయావు !

విలియం :- ( కుర్చీ జేసీ దగ్గరకు లాక్కొని ) ఈ వేళ చాల సరదాగా వుంది జేసీ!

జేసీ :— (ముఖంత్రిప్పుకొని) అరె ! నువ్వు బ్రాందికూడ త్రాగేవా ? ( ముక్కు మూసుకొంటూ ) ముక్కు బద్దలై పోతోంది. కొంచెం దూరంగా కూర్చో. ఈ రోజు ఏం రోగం వచ్చింది నీకు ?!

విలియం :- (జేసీవైపుకు వంగి) ఈ రోజు నా మనస్సు సప్తస్వర్గాల్లోనూ, మొట్టమొదటిదానిమీద విహరిస్తూవుంది జేసీ ! ఇప్పుడు నేను పూర్వం విలియంనుకాను. స్వర్గంలోవుండే వారుకూడ ముగ్ధులయే, జీవిత స్వప్నాల్ని చూస్తున్నాను;

ఇప్పుడు ముల్లోకాల ధనంకన్నా అధికమైన వరదానం దొరుకు తుంది నాకు. నిన్ను నా జీవిత సహచరిణిగా చేసుకోదలచు కొన్నాను. ఈవేళ ప్రొపోజ్ చేస్తున్నాను. (కుర్చీమీదనుంచి లేచి, జేనీ కాళ్ళమీద తలవుంచి) చూడు జేనీ ! భగవంతుని ముఖంచూసి నిరాకరించకు. చెప్పు. నా ప్రార్థన అంగీకరిస్తు న్నావా ? నీమాటమీద నాఅదృష్టం ఆధారపడివుంది. నువ్వు "ఊఁ" అంటే, నావంటి భాగ్యశాలి ఈప్రపంచంలో వుండడు; "ఉహుఁ" అంటే,—నాలాంటి నిర్భాగ్యుడు ప్రపంచంలో ఎక్కడా వుండడు. నీకు మీసాలు తీసేయడం నచ్చకపోతే మళ్ళీ మీసాలు పెంచుతాను. ఈ రోజుకోసం ఈ సూటు తయారుచేయించాను. ఇది నాకు అందవికారంగా లేదుకదూ?

జేనీ :- అబ్బెబ్బే. అసలు లేదు. దిష్టితగలకుండా భగ వంతుడు రక్షించుగాక !

విలియం :- (సంతోషంగా) నేను టెన్నిస్ బాగా ఆడ తాను జేనీ !

జేనీ :_ నిజమా !

విలియం :- నామీద ఒట్టు. పియానోకూడ బాగా వాయిస్తాను.

జేనీ :-అయితే, గొప్ప మాష్టరు వయిపోయావే !

విలియం :- నానాట్యం చూస్తే, నువ్వుకూడ నాట్యం చేయనారంభిస్తావ్.

జేనీ :- అయితే, నిన్ను పెళ్ళి చేసుకోడానికి అభ్యం తరం వుండదు.

విలియం :- నిజంగా ? అయితే ఈరోజు నాజీవితానికి పండుగ.

జేనీ:_సరే ! ఇక, మన షరతులు నిర్ణయించుకొందాం.

విలియం :- అన్నీ చెర్చిలో అయిపోతాయి జేనీ ! ఓహో ! నువ్వు, నేను షికారుకు వెళుతుండగా — నువ్వు సిల్కు గౌను తొడుక్కొని, పూలచెండు చేత్తో పట్టుకొని, నా భుజంమీద తలఆన్చి నడుస్తున్నప్పుడు — ఎంత ఆనందంగా వుంటుంది!

జేనీ :- నాకు అటువంటి వేషాలు పనికిరావు.

విలియం :- అయితే, మరెటువంటి పెళ్లి కావాలి జేనీ?

జేనీ :- నువ్వు నాషరతుల్ని అంగీకరిస్తే, పెళ్లి అయిపోయినట్లే. చెర్చికి వెళ్ళడం, ఫాదరీ రావడం, అతిథులు చూడటం, బాజాలు వాగడం — యివేమీ అవసరంలేదు. నాకు ఆ ఆచారాలు నచ్చవు. చెప్పు! నా షరతులకు యిష్టపడతావా ?

విలియం :_ (నిరాశతో) ఏమి షరతులు జేనీ?

జేనీ :- మొదటి షరతు: నువ్వు పరస్త్రీతో మాట్లాడుతున్నట్లు చూడగానే యింట్లోంచి బయటకు గెంటేస్తాను.

విలియం :- ఆఁ ఆఁ యిష్టమే జేనీ !

జేనీ :_ నా రెండవ షరతు : వివాహమయిన తర్వాత కూడ, యిష్టమయిన వారితో మాట్లాడతాను, నవ్వుతాను; అవసరమైన చోటుకు వెళతాను, వస్తాను, కోరినవారిని ప్రేమిస్తాను, ప్రేమింప జేసుకొంటాను. చెప్పు. యిష్టమేనా ?

విలియం :- ఇదెలా కుదురుతుంది జేనీ! వేళాకోళ మాడుతున్నావా? పెళ్ళి అయినతర్వాత ఎవడైనా సరే, నీవంక చూస్తే, వాడి రక్తం త్రాగుతాను. భూమిలో పాతి పెడతాను; బ్రతికివుండగానే మింగేస్తాను.

జేనీ :- అయితే, నీకు నాకు కుదరదు.

విలియం :- చూడు జేనీ! నా సరదాను చంపకు. నా జీవితం నాశనమయిపోతుంది.

జేనీ :- సరే! యింతవరకు ఏదో పరిహాసం అయిపో యింది. కాని, విలియం! నువ్వు ఎందుకు పెళ్ళి చేసుకోవాలను కొంటున్నావ్?

విలియం :- (కొంచెం కంగారుపడి) అందరు ఎందుకు చేసుకొంటున్నారు?

జేనీ :- అందరు పనిలేక చేసుకొంటున్నారు. కాని, నువ్వు ఎందుకు పెళ్ళిచేసుకోవాలను కొంటున్నావని అడుగు తున్నాను.

(విలియం తల గోక్కొంటూ ప్రక్కకుచూస్తుం టాడు.)

జేనీ :- నీకు తెలియదా? సరే, నేను చెబుతానువిను. నీ మనస్సును ఆనందపరచటానికి, ఒక ఆటబొమ్మ నీ యింటికి రావాలనే వుద్దేశంతోనే నువ్వు వివాహం చేసుకోవాలను కొంటున్నావు.

విలియం :- అంతే అంతే జేనీ! నువ్వు ఎంత బుద్ధిమంతు రాలివి!

జేసీ :_నేనుఅందమైనచీర కట్టుకొని,నీతోకలసి కారులో వెళుతూ వుండగా, ప్రజలు నవ్వుకొంటూ 'విలియం ఎంత అదృష్టవంతుడు !' అని అనుకోడానికి నువ్వు పెళ్లి చేసు కోవాలను కొంటున్నావు.

విలియం :- అంతే, అంతే జేసీ ! నిజంగా నువ్వు చాల బుద్ధిమంతు రాలివి!

జేసీ :- నువ్వు ఆఫీసర్లకు విందు చేసినప్పుడు, నేను వారితో తియ్యగా మాట్లాడి, వారి హృదయాలను ఆనంద పరచి, నీకు పెద్దవుద్యోగం యిచ్చేటట్టు చేయాలని కదూ?

విలియం :- అంతే, అంతే జేసీ!

జేసీ :_ నువ్వు సంపాదించిన వెండి బంగారాలకు వారసు లుండాలని కదూ ?

విలియం :- అంతే, అంతే జేసీ, భగవంతుడు అను గ్రహించు గాక!

జేసీ :- అయితే, నీ అభిప్రాయాలకు ఏకీభవించే ఒక మంచి స్త్రీని వెదకివుంచాను. ఆమె నాకంటె చాలయోగ్యురా లైన భార్యగా వుంటుంది నీకు. నువ్వు చెప్పినచోట ఉంటుంది. చేయమన్న పని చేస్తుంది; యిల్లంతా తుడుస్తుంది, వంట చేస్తుంది, పరుపు వేస్తుంది.

విలియం :_ (సంతోషంతో) ఆమె ఎవరు జేసీ ?

జేసీ :- మాదాసీమనిషి ! తెల్లగా, చంచలమైన నవ్వు ముఖంగల అందమైన ఆడది.

విలియం :- నువ్వు నన్ను అవమాన పరుస్తున్నావు జేసీ! దాసీదాన్ని పెళ్ళి చేసుకొంటానా? నాకు వంశ మర్యాద కావాలి.

జేసీ :- ఓహో! నీ వంశ మర్యాదకు మచ్చరాని భార్య కావాలా నీకు?

విలియం :- మరే మను కొన్నావు?

జేసీ :- అయితే, నీకు వివాహ మంటే, అర్థం తెలియదన్న మాట!

విలియం :- తెలియక పోవడమేమిటి? నేను వెర్రివాడననుకున్నావా? నాదగ్గర ఎటువంటి సర్టిఫికెట్లు వున్నాయో తెలుసా? చూస్తే ఆశ్చర్య పోతావు.

జేసీ :- ఓహో! ఇదొక క్రొత్త విషయమే!

విలియం :- నేను సరిగ్గా మాట్లాడటం లేదని, అమాయకుడనను కొంటున్నావేమో! నన్ను, నేను పొగుడుకోవడం చాల నీచమైన పని. కాని, ఇటువంటి సమయంలో నా సర్టిఫికేట్లు చూపించకుండా ఎలా వుండను? చూడు- (జేబులోంచి కాగితాలకట్ట తీసి) ఇది మిసెస్ డగ్లస్ యిచ్చింది. ఆమె నా టెన్నిస్ ఆట గురించి ఎంత పొగిడిందో చూడు.

(జేసీ అది చదువుతుంది :— It is hereby certified that Doby William handles his tennis ball just as a skilful wife handles her husband and consequently he should not be disqualified in a matrimonial game on this account.)

జేసీ :- అబ్బ! ఈ యోగ్యతాపత్రం నానోరు నొక్కేసింది. నీలో యిటువంటి గుణాలుకూడ వున్నాయా?

విలియం :- ఆఁ. మరేమనుకొన్నావ్! యింకా చూడు. ఇది మిస్ డాసన్ యిచ్చింది.

( జేనీ రెండవ కాగితాన్ని చదువుతుంది :—

It is hereby certified that Doby William has invented an altogether new dance, never heard of before, and nobody else can compete him there. It is no extra qualification in his favour for a matrimonial job. )

జేనీ :- యిటువంటి మహోత్తరమైన యోగ్యతా పత్రాల్ని దాచిపెట్టుకొన్నావేం ?

విలియం :- ఇంకా చూడు. దీనిలో హెడ్ మాష్టారు నా 'కేరక్టర్ను' పొగిడి వ్రాశారు. అరె! ఈ సర్టిఫికెట్ చూపడం మరచి పోయానే! చూడు! ఇది గవర్నర్ హిజ్ హాయినెస్ మా ఫాదర్‌కు యిచ్చాడు. నన్ను సాధారణ వ్యక్తిలా మాత్రం భావించకు.

( మిసెస్ డగ్లస్, మిస్ డాసన్ — యిద్దరు వస్తూంటారు. వారిని చూసి విలియం పారిపోతాడు. )

మిస్ డాసన్ :- విలియం వింతప్రవృత్తిని చూడాలని వచ్చాం. ఈ రోజు ప్రొపోజ్ చేయాలని వచ్చాడు. నన్నొక సర్టిఫికెట్ వ్రాసియిమ్మని చంపుకుతిన్నాడు. ఏం వ్రాయమంటావు ?

మిసెస్ డగ్లస్ :- శుద్ధ మూర్ఖుడు. టెన్నిస్ సర్టిఫికెట్ వ్రాసి యిమ్మని నన్నుకూడ బలవంతం చేశాడు. రేకట్ పట్టుకోడంకూడ రాదు. ఏం వ్రాయను ?

మిస్ డాసన్ :_ ఏమయింది? అతను ప్రొపోజ్ చేశాడా? ఆ కథ కొంచెం చెప్పు!

మిసెస్ డగ్లస్ :_ ఇది వినాలనే పరుగెత్తుకుంటూ వచ్చాం.

జేనీ :- మిమ్మల్ని చూడగానే పారిపోయాడు. కాని, మీరు చాల స్ట్రాంగ్ సర్టిఫికెట్లు యిచ్చారే! ఆనందాన్ని అణచుకో లేక పోతున్నాడు. వాటిని జేబులోనే పెట్టుకొని తిరుగుతున్నాడు.

మిసెస్ డగ్లస్ :-
మిస్ డాసన్ :- } ఏమిటి? మేము వ్రాసియిచ్చామా? లేదే!

జేనీ :- చూపిస్తున్నాడే!

మిస్ డాసన్ :_ దుర్మార్గుడు. తనే వ్రాసుకొని వుండొచ్చు. యిప్పుడే పోయాడా? ఆ రెండు కాగితాలు ఏవి?

జేనీ :- ఆ కాగితాలు తీసుకు పోయాడు. కాని, వాటి సారాంశం నాకు జ్ఞాపకంవుంది. మహాశయుడు ఆకాగితాల్లో తనను చాలా పొగుడుకొన్నాడు.

( జేనీ ఒక కాగితంమీద, రెండు సర్టిఫికెట్లలోని సారాంశము జ్ఞాపకం చేసుకొని వ్రాస్తుంది. అదిచూసి ముగ్గురు నవ్వలేక క్రిందా మీదా అవుతారు. )

( తెర )

# ఐదవ దృశ్యం

(యోగరాజు భవనం. ప్రభాత సమయం. యోగరాజు, జేనీ ఒక గదిలో కూర్చొని మాట్లాడు తుంటారు. యోగరాజు ముఖంలో విచారరేఖలు ఆవ రించివున్నాయి, కండ్లు యెర్రబడి వున్నాయి. కంఠం కొంచెం గద్గదికంగా వుంటుంది. జేనీ ప్రయాణవస్త్రాలు ధరించటంవలన అప్పుడే వచ్చినట్లు తోస్తుంది.)

జేనీ :- ఒక్కరోజు ముందు రాలేకపోయినందుకు విచా రిస్తున్నాను. టెలిగ్రాం అందేటప్పటికే అమ్మకు జబ్బుగావుంది. ఆమె ఆరోగ్యం కొంచెం బాగుపడితే, వద్దామనుకున్నాను; కాని, యిలాజరుగుతుందని తెలిసుంటే, వెంటనే వచ్చేదానిని.

యోగ :- చనిపోయేటప్పుడుకూడ ఆమె మీ పేరునే జపించింది. అస్తమాను మిమ్మల్నే అడిగేది. (నిట్టూర్చి) నేను అన్నివిధాల దౌర్భాగ్యుణ్ణి మిస్ జేనీ ! నాకు జీవితంలో ఒక విచిత్ర సంపత్తిదొరికింది; కాని, దానిని పోగొట్టుకోవడంవలన, ప్రపంచమే శూన్యంగా తోస్తోంది. ఇదంతా నా కర్మ ఫలి తమే. నేనే ఆమెను చంపుకొన్నాను. నా కామ వాంఛే ఆ లేత కుసుమాన్ని త్రుంచివేసింది. ఆమెకు రెండుసార్లు గర్భ స్రావం జరిగింది. అయినా, నాఅంధనేత్రాలు తెరుచుకోలేదు. ఆ సుగంధ కుసుమంతో నాజీవితాన్ని స్వర్గతుల్యం చేసుకొని, కండ్లకద్దుకొంటూ, హృదయంలో దాచుకోడానికి బదులుగా కాళ్ళతో త్రొక్కివేశాను. అప్పుడప్పుడు తల గోడకు కొట్టు

కొని, బద్దలు చేసుకోవా లనిపిస్తుంది. ఈ మచ్చ హృదయం లోంచి ఎప్పుడూ చెరగదు; ఈగాయం ఎన్నటికీ మానదు.

(ఏడుస్తాడు)

జేనీ :- ఇలా అధైర్యపడుతుంటే, పనెలా జరుగుతుంది ? నేను ఆమె స్నేహితురాలినైనా, ఆమెను సోదరికంటె ఎక్కువగా ప్రేమించాను. ఇక మీ దుఃఖానికి హద్దువుంటుందా? ఎటువంటి హృదయాన్నైనా ఆకర్షించుకొనే స్వభావమామెది; కాని, యిప్పుడు అధైర్యపడితే లాభమేమిటి ? భగవదేచ్ఛ యిలావుండగా మనమేమి చెయ్యగలం ? ఈ ప్రపంచం ఆమెకు తగినది కాదనుకొని, ధైర్యం వహించడం మంచిది. ఆమె స్వర్గంలో వుండవలసింది; అందుకే స్వర్గం ఆమెను తనదగ్గరకు లాక్కొంది.

యోగ :- అయ్యో ! ఎంతప్రయత్నించినా హృదయా వేదన తగ్గటం లేదు మిస్ జేనీ ! ఆమెకు చావువచ్చి చచ్చిపోతే, అంతగా విచారముండేది కాదు. కాని, నా కాముకత్వమే ఆమెను హత్యచేసిందన్న విషయాన్ని ఎలా మరచిపోగలను ? ఒక పశువు గడ్డి తిన్నట్లుగా, అమృతాన్ని నమిలి తిన్నాను. ఆమె నాకు ఆహుతైపోయింది. నాకు విరుద్ధంగా ఏమీ చెప్పేదికాదు. నన్ను సంతోషపరచటమే ఆమె జీవిత లక్ష్యం. ఉదయం లేచినప్పటినుంచి, చిరునవ్వులను చిందించే ఆమె సుకోమల వదనబింబం మధురాన్ని వర్షింపజేస్తూ కనుపిస్తూండేది. రోజురోజుకు బలహీనంగా అవుతున్నా, నాకు మాత్రం ఏలోటు రానిచ్చేదికాదు. ఈ యింట్లోని ప్రతివస్తువు

లోను ఆమె ప్రేమ నిండివుంది. ఆమె కోమలమైన పుష్పం వంటిదయినా, పువ్వులంటే ఎంతో యిష్టం. ఎదురుగావున్న ఆ చామంతి ఆమె నాటిందే. నాకు కావలసినవన్నీ తన చేతులతో తయారు చేసేది. కుర్చీలమీదనున్న ఈ పూల తలగడలు ఆమె కుట్టినవే. మేజామీదనున్న అల్లికగుడ్డ ఆమె అల్లినదే. తలగడ గుడ్డలు ఆమె తయారుచేసినవే. ఎన్నని తలచుకొని ఏడవను ? ఆమె నాకు అంకితమై పోయింది. నావంటి వ్యసనునికి, అధమునికి, అనాచారికి అటువంటి దేవి లభించడం భావ్యంకాదు. భగవంతుడు మొద్దుమెడకు ముత్యాలహారం తగిలించాడు.

(యోగరాజు కళ్ళు మూసుకొని కొంతసేపు నిశ్శబ్దంగా కూర్చొంటాడు. అంతలోనే, తలబాదుకొంటూ, తోటలోనికి పరుగెత్తుతాడు. జేనీ అతని వెనుకనే వెళుతుంది. అతను ఏదో వెదుకుతున్నట్లు పూల మొక్కలవంక చూస్తుంటాడు. అక్కడనుంచి దురుసుగా ఉమ గదిలోకి వచ్చి, గది శూన్యంగా వుండటంచూసి, గుండెలుబాదుకొంటూ, భూమిమీద పడిపోతాడు. జేనీ కళ్ళవెంబడి అశ్రుధారలు ప్రవహిస్తుంటాయి. పరుగెత్తుకొని వెళ్ళి, నీళ్లుతెచ్చి, అతని ముఖంమీద చిలకరిస్తుంది. ఒక్క నిమిషంలో యోగరాజు తృళ్ళిపడి లేస్తాడు.)

జేనీ :- మీకు అన్నీ తెలిసివుండికూడ యిలా అజ్ఞానుల్లా ప్రవర్తిస్తే యెలా ?

యోగ :- నాకేమయిందో చెప్పలేను జేనీ ! ఉమ,తన గదిలో కూర్చున్నట్లు, తోటలో తిరుగుతున్నట్లు తోస్తుంది. ఈ జీవితంలో ఆమె దర్శనభాగ్యం కలగదని తెలుసు; కాని, భ్రమమాత్రం పోవడంలేదు. 'ఆమె నాలుగైదు రోజులపాటు ఎక్కడికో వెళ్ళిం'దని ఎవరైనా చెబుతుండగా వినాలని పిస్తుంది. 'ఆమె ఎన్నటికీ దొరుకదు, శాశ్వతంగా వెళ్ళి పోయింది' అంటేమాత్రం సహించలేను......(ఒక్క క్షణం తర్వాత తలబాదుకొంటూ) మీరు ప్రయాణంచేసి వచ్చారనే ధ్యానమే లేదు. అయ్యో ! ఆమె వుంటే మిమ్మల్ని చూసి ఎంత సంతోషించేది ! మిమ్మల్ని నేను ఎలాసత్కరించగలను? సత్కరించేది వెళ్ళిపోయింది.

( వంటమనిషిని పిలుస్తాడు. )

చూడు, ఈమెకు ఫలహారం తీసుకురా. చాల త్వరగా. పనిమనిషిని యిలా పంపు. ఈమె కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు కావాలి.

జేనీ :- మీరు విచారించకండి. యిప్పుడు నాకు ఫలహారం చేయాలని లేదు.

యోగ :- ఇంకేమి కావాలి ? రండి, ఉమ గది చూపిస్తాను. చూడండి. ఎటువంటి సాహిత్యగ్రంథాల్ని ప్రోగు చేసిందో ! ఆమె వ్రాసిన కవిత్వం మీకు వినిపించనా ?

( యిద్దరు, మంచి మంచి పరదాలతోను, అందమయిన తలగడలతోను, గాజు సామాన్లతోను అలంకరించబడిన ఉమ గదిలోకి వెళతారు. యోగరాజు ఒక

అలమర తెరుస్తాడు. దానిలో ఉమ ఆభూషణాల పెట్టె వుంటుంది. యోగరాజు దానిని తెరచి, ఒక్కొక్క వస్తువు జేనీకి చూపిస్తుంటాడు. )

యోగ :- ఇవి ఆమె వస్తువులు. వీటిని ధరించి ఆమె యెంత అందంగా వుండేది ! వీటి ప్రతి అణువులోను ఆమె స్పర్శయొక్క పరిమళం యిమిడివుంది. ఇవి, తమ స్వర్ణ నేత్రాలతో ఆమె రూప ప్రకాశాన్ని చూశాయి; ఆమె ప్రేమానురాగాలను పొందాయి. ఇవి ఈవిధంగా దుస్థితిలో వుండటం నేను చూడలేను. తన వస్తువులు ఈ విధంగా వుండటం చూసి, స్వర్గంలో ఆమెకు ఎంత దుఃఖం కలుగు తుందో ! నా కోరిక చంపుకోలేను మిస్ జేనీ ! క్షమించి, ఈ వస్తువుల్ని మీరు ధరిస్తే, ఆమె ఆత్మకు ఎంతో శాంతి కలుగుతుంది. మరే విధంగా చేసినా ఆమెకు యింత ఆనందం కలుగదు. మిమ్మల్ని ఆమె సోదరిగా భావించేది; ఈ సం బంధంవల్లనే వీటిని స్వీకరించమని బలవంతం చేస్తున్నాను.

( వికటంగా నవ్వుతాడు. )

జేనీ :_ (కన్నీటితో) మీరు నా నోటిని బంధించారు. కాని, వీటికి నేను యోగ్యురాలను కాను. వీటిని మీదగ్గరే ఆమె స్మృతి చిహ్నంగా జాగ్రత చేయండి. వీటికి హక్కు దారులు వచ్చినప్పుడు, వారికి నా తరఫున బహూకరించండి.

యోగ :— (నిట్టూర్చి) ఆ సమయం ఎప్పుడూ రాదు జేసీ! ఉమ విడచి వెళ్ళిన స్థానం శాశ్వతంగా ఖాళీగా వుంటుంది—శాశ్వతంగా మీరు నాకోరిక నిరాకరించి, నాకు, ఆమె ఆత్మకుకూడ బాధ కలిగిస్తున్నారు. కాని, నేను పట్టుదల గల మనిషిని జేసీ! అప్పుడప్పుడు పిచ్చివానిలా ప్రవర్తిస్తుంటాను. రండి మీకొక వస్తువు ధరింపజేస్తాను. వ్యథితహృదయం చేసే అపరాధాన్ని క్షమించండి.

(అంటూ యోగరాజు ఆ హారాన్ని జేసీ మెడలో వేస్తాడు. జేసీ తలవంచుకొని ఏడుస్తుంటుంది. యోగరాజు ఆమె చేతులకు కంకణాలు, మెడలో నెక్‌లెస్, తల్లో చామంతిపువ్వు ధరింపజేస్తాడు. కాళ్ళకు పాంజాపట్టీలు వేయాలని వంగేసరికి, జేసీ కాళ్ళను తొలగించి, పాంజాపట్టీలు తీసుకొని, తనే వేసుకొంటుంది. ఎదురుగా అద్దం వుంటుంది. జేసీ దానిలో తన ఆకారాన్ని చూసుకొని వికటంగా నవ్వుతుంది.)

జేసీ :— మీరు నన్ను బొమ్మలా తయారు చేశారు. ఈ వస్తువులు నాకు బాగా లేవు.

యోగ :— మీరు నా కళ్ళతో చూడటంలేదు జేసీ! ఉమకు నామీద దయకలిగి, ఆకాశం మీదనుంచి దిగి వచ్చినట్లు తోస్తుంది. మీకు, ఆమెకు యింత పోలిక వుంటుందని

నేనెప్పుడూ అనుకోలేదు. నీవు నా ఉమవు జేనీ ! నీలో ఆ ఆత్మ వుంది. ఆ అపురూపమేవుంది. ఆ కోమలత్వమేవుంది. నీవు ఆమెవే! నా ప్రియమైన ఉమ ! నీకు నామీద ఎందుకు కోపం వచ్చింది? నే నేమి అపరాధం చేశానో చెప్పు. ఎవరైనా యిలా తమ ప్రియుల్ని అన్యాయం చేస్తారా ?

( వెక్కి వెక్కి ఏడుస్తాడు. )

జేనీ :- (కంగారుగా) ఏమండీ ! తెలివిగా వుండండి. ఇలా అయిపోయారేమిటి ?

( మనుష్యుల్ని పిలుస్తుంది. )

( తెర )

# ఆరవ దృశ్యం

(యోగరాజు భవనం. జేని, యోగరాజు కూర్చొని మాట్లాడు తుంటారు.)

జేని :- రెండు రోజులు వుండిపోదామని వచ్చి, మూడు నెలలు వుండిపోయాను. అమ్మ నన్ను రోజు తిడుతుంటుంది. ఇక్కడకు రమ్మని ఎన్నోసార్లు వ్రాశాను; కాని, ఆమె రావడంలేదు. అందుచేత రెండు మూడు రోజులు యింటికి వెళ్ళి వద్దామనుకొంటున్నాను.

యోగ :- ఆమెది చాలవిచిత్రమైన స్వభావం. రూపాయిలు తీసుకోదు. రానూరాదు. ఇంతకూ ఏం కావాలో ?

జేని :- నేను పెళ్ళిచేసుకొని ఆమెదగ్గర వుండటమే. బహుశా మీరు నన్ను యెత్తుకుపోతారేమోనని భయంకూడ వుండొచ్చు.

యోగ :- (నవ్వి) నువ్వు వెడితే మళ్ళీ తిరిగిరాలేవు. నా ఫిలిం సగంలో ఆగిపోతుంది. ఇది పూర్తికానిదే, నిన్ను ఒక్కరోజుకూడ విడిచిపెట్టలేను. ఇంకా నీదగ్గర ఏం దాచను జేని ! దాచడంకూడ వ్యర్థం. బహుశా నువ్వు ముందే తెలుసుకొని వుంటావు. యిప్పుడు నువ్వు లేకుండా నేను బ్రతకలేను. నీలో, నేను నా ఉమను మళ్ళీపొందాను. అప్పుడేకనుక నువ్వు రాకుంటే, నే నేస్థితిలో వుండేవాడినో తెలియదు. బహుశా

పిచ్చివాడినయిపోయే వాడిని. ఎందులోనో దుమికి చనిపోయే వాడిని. నువ్వు వచ్చి, నా వ్యథిత హృదయానికి చికిత్సచేసి, బ్రతికించావు.

జేనీ :- అందుకే, యిక నేను వెళ్ళడం అవసరం. నేను వెళ్ళాలనుకోవడంలేదు. ఎందుకు వెళ్ళాలనుకోవడం లేదో మీరుకూడ తెలుసుకొనే వుంటారు. కాని, దీని ఫలితం? నేను ఏడ్చి ఏడ్చి చావడమేకాక, మిమ్మల్నికూడ బాధపెట్టాలి. నాకు ఏడ్వడం అలవాటే. కాని, మీరెందుకు ఏడవాలి ? మీ హృదయం కొద్దిరోజుల్లో మారుతుంది. భోగ విలాసాల్లో జీవితేచ్ఛలు మేల్కొని, మళ్ళీ మీరు అసలు స్వరూపంలోకి వస్తారు. మీ సహృదయము, మీ ఉదారత్వము, మీ సజ్జనత్వము, మీ ఉన్నతాత్మవలన; మీరు ఎవరితో సంపర్కమేర్పరచుకొన్నా, వారిలో మీ ఆదర్శాన్ని ఆరోపించగలరు. నావంటి స్త్రీలోనే మీరు సద్గుణాల్ని చూడగలిగినప్పుడు, మీ స్వర్గాన్ని మీరే నిర్మించుకోగలరని నాకు తోచింది. మట్టినికూడ బంగారం చేయగల మంత్రం మీకు వచ్చు. 'నేను ఎప్పటికైనా, యెవరినైనా ప్రేమించగలను'అని వూహించనైనా లేదు. ప్రేమ నాకు వినోద, పరిహాసాల వస్తువులా వుండేది. మీరు నా హృదయ కుహరంలో ప్రేమ జ్యోతిని వెలిగించారు. కాని, ఆ వెనుకటి జీవితం, స్మృతిపథంలోకి వస్తే, ఎంతో రసవిహీనమై, అస్వాభావికమై, సంస్కారణకు తావు లేనట్లు తోస్తుంది. మీకు, నాకు మధ్య విధి నిలచివుండి ... ... ... ...

యోగ :_ ఆ విధిని మనం జయించలేమా జేసీ ?

జేసీ :- ఎలా ?

యోగ :- మనం వివాహం చేసుకొంటే ?

జేసీ :- ధర్మబంధాల్ని ఏమి చేస్తారు ?

యోగ :- ధర్మబంధాల్ని తెగ్గొడతాను.

జేసీ :_ (చేతిని వద్దన్నట్లు త్రిప్పుతూ) వద్దు, వద్దు. నేను మిమ్మల్ని సమాజానికి దూరంగా వుండనివ్వను. మీరు సమాజం నుంచి బహిష్కరించ బడటం నాకు యిష్టం లేదు. మిమ్మల్ని ఈ భయంకర ధర్మ సంకటాల్లో వేయలేను. నా యందు మీకు వున్న సద్భావంమీద యింత బరువు వేసి అణచడం నాకూ మంచిదికాదు; మీకూ శ్రేయస్కరం కాదు. నా సేవాభావంతో ఆ అవమానాన్ని, అపవాదుల్ని సహించగలరని నాకు తెలుసు; కాని, నేను యింత స్వార్థపరురాలిని కాను.

యోగ :_ నేను సమాజాన్ని, దాని నిబంధనల్ని లక్ష్యపెట్టను జేసీ ! సమాజాని కేదైనా హాని చేసినట్లయితే, నిస్సందేహంగా సమాజం నన్ను బహిష్కరించగలదు; కాని, నా వ్యక్తిగత అధికారాన్ని సమాజానికి భయపడి విడచిపెట్ట దలచుకోలేదు.

జేసీ :_ (ఆలోచించి) వద్దు. ఇటువంటి విషయాల్లో తర్కం వలన లాభంలేదు. నన్ను వెళ్ళనివ్వండి. మీ ఎడబాటులో ప్రపంచం అంధకారంగా వుంటుంది; కాని, లోకం

లోని దయారహిత అఘాతాలనుంచి మిమ్మల్ని రక్షించినందుకు నాకు ఆనందం కలుగుతుంటుంది.

యోగ :- ఈ ఆనందం చాల తక్కువరోజు లుంటుంది జేనీ! నువ్వు వెళ్ళిన తర్వాత, నేను యిదంతా మరచిపోయి, ఒక అందమైన యువతిని వివాహం చేసుకొని ఆనందిస్తానను కోడం పొరపాటు. నా స్వర్గాన్ని నాఅంతట నేను తయారు చేసుకోగల ననుకొన్నావు. నీయందు నాకున్న ప్రేమనే ఈ శక్తికి ప్రమాణంగా భావిస్తున్నావు. వాస్తవంలో నువ్వు నీ విలువను చాలా తక్కువగా తలుస్తున్నావు. నేను నీలో పొందినది, చూచినది; మరెక్కడైనా చూడగల ననుకోడం కేవలం భ్రమ. దీని ప్రమాణం నీకు త్వరలో దొరుకుతుంది. స్వార్థరహితప్రేమ బజారులో దొరికేటంతటి చౌకవస్తువుకాదు.

( ఇద్దరు కొంత సేపటివరకు తల వంచుకొని ఆలోచనలో కూర్చొని వుంటారు. )

యోగ :- ఒకవేళ సమాజ భయముంటే, మనల్ని ఎవ్వరూ ఎరుగని మరొక స్థలానికి ఎందుకు పోకూడదు ?

జేనీ :- (చిరునవ్వు నవ్వి) రైతుకు తనపొలం తన నేత్రాలముందు మేయబడినప్పుడే దుఃఖం కలుగుతుందా ? ఏ అపరాధం లేకుండా దొంగలలా వుండటం సుఖమయ జీవితంకాదు. మనం ఆదర సన్మానాలు కోరేవారినుండే, నిందలుపొంది దుఃఖపడతాము. ఇతరులు ఏమనుకొంటున్నారో కూడ మనకు లక్ష్యం వుండదు. మమ్మీ విషం తినేస్తుంది; ఇక మీయింటివాళ్ళుకూడ సంతోషించరు.

యోగ :- ఏమి చెప్పినా నువ్వు ఒప్పుకోవడంలేదు జేనీ!

జేనీ :- ఏ పరిస్థితుల్లో భగవంతుడు మనల్ని సృష్టించాడో; దాని కుపాయం—మన మిద్దరం ఒకరికొకరం వేరుగా వుండటమే. నేను మీ కోసం ఏదైనా సహించగలను; కాని, మిమ్మల్ని ఆ భాధల్లో వేయలేను. 'స్త్రీకోసం క్రైస్తవుడయిపోయాడు' అనే ఆక్షేపణ నేను వినలేను. 'భాగ్యానికిబానిసయై భోగవిలాసాలకోసం ఒక మనిషితో వెళ్ళిపోయింది' అని నాకు వచ్చే నిందను మీరుకూడ సహించలేరు. నేను ప్రస్తుత ఆచారాల్ని అనుసరించి శుద్ధిచేసుకొని, మిమ్మల్ని ఆ ఆక్షేపణనుంచి రక్షించగలను. కాని, శుద్ధి అనేది పూర్తిగా మోసమని నా ఉద్దేశం. నేను నా స్వభావం వలన, సంస్కారాల వలన వున్నలాగే వుంటాను. హోమాలు చేసినా, లేక రెండు మూడు మంత్రాలు చదివినా నాలో మార్పురాదు. క్రైస్తవ మతంలోని అనేక విషయాలు నన్ను బాధిస్తుంటాయి; అయితే హిందూమతంలోకూడ అటువంటివాటికి లోటులేదు. క్రైస్తవ మతంలో కనీసం సేవాధర్మమనే ఒక తత్త్వమైనా వుంది. కాని, హిందూధర్మంలో అదికూడ లేదు. ఇందులో ప్రాచీన ఆచారాలతో కూడిన కొన్ని నిబంధన లున్నాయి. వాటిని అనుసరించడానికి నా ఆత్మ ఒప్పుకోదు. నాకు చిరునవ్వుతో శెలవియ్యండి. కాని, ఈ వియోగం మన ఆత్మైక్యతను శిథిల పరచకుండా చూడండి. నన్నుకోప్పడవద్దు. నాయందు విముఖత వహించవద్దు. జేనీ మీది, మీదిగానే వుంటుంది;—ప్రపంచ దృష్టిలో కాదు—ప్రపంచాన్నిసృష్టించే భగవంతునిదృష్టిలో.

యోగ :- (కంపిత స్వరంతో) అయితే, ఇది నీ అంతిమ నిర్ణయమా జేనీ!

జేనీ :- అవును ప్రియా! ఇదే నా అంతిమ నిర్ణయం. మీరు నన్ను కొద్దిరోజుల్లో మరచిపోతారు. వీలయినంత త్వరలో మరచిపోవాలనే, భగవంతుని నేను కోరేదికూడాను; కాని, మరచిపోయినా అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకుంటుండండి. (ఏడ్చి) రోజులు యింత త్వరగా గడుస్తాయని నేననుకోలేదు; కాని, జీవిత యాత్రకు అవసరమైన ప్రేమామృతాన్ని మీరిచ్చారు, అది నా జీవితాంతంవరకు చాలు. నా దృష్టిలో వివాహం ఆత్మకు సంబధించినది. దానిని ఆచార శృంఖలాల్లో బంధించడం, అనవసరమేకాదు పాపంకూడాను. హృదయాలు కలియడమే వివాహం. ఆచార శృంఖలాల్లో స్త్రీపురుషుల్ని బంధిచడం, ఒక త్రాడుతో రెండు పశువుల్ని కట్టడంవంటిది. సమాజం లేక ధర్మభీతిమీద ఆధారపడిన బంధన ఎప్పటికీ సుఖమయం కాదు. స్వేచ్ఛే సుఖానికి మూలం — బంధన మాత్రం కాదు. ప్రేమకూడ జలప్రవాహంలా స్వేచ్ఛగా వుండాలనుకొంటుంది. అవరోధనవలన, అందులో కీటకాలు పుట్టి, దుర్గంధం వస్తుంది. ఒక మొక్క వెలుతురు లేకపోతే జీవాన్ని కోల్పోయినట్లు, ప్రేమకూడ శృంఖలాల్లో బంధింపబడితే, నిర్జీవమవుతుందని నా ఉద్దేశం. నేను స్వతంత్రంగా రాత్రి అంతా యిక్కడ ఉండగలను; కాని, ఎవరైనా ఈ ద్వారాన్ని మూస్తే, ఈ క్షణంలోనే బయటకు పోవడానికి విహ్వాల పడతాను.

యోగ :- నేను దీనికి సిద్ధంగావున్నాను జేసీ !

జేసీ :- నేను మిమ్మల్ని ముళ్ళలోకి త్రోయదలచుకో లేదు. సమాజంలో మీకున్న స్థానాన్ని రక్షించడం కూడ, నా ప్రేమైక్య హృదయంయొక్క లక్ష్యం. ఇది నా జీవితానికి నూతనానుభవం. నిందావమానాలను మీరు లక్ష్యపెట్టరని తెలుసు; కాని, మానవుడు ప్రకృతి నియమాల్లో బంధింపబడి వున్నాడు. వాటిని ఎలా తిరస్కరించగలరు ? ఈ మానసిక బాధలతో కూడిన దుర్భర వాతావరణంలో మీరు చాల రోజులవరకు నిగ్రహంతో వుండలేరు. మిమ్మల్ని నేను అను మానించడంలేదు. కాని, టాల్‌స్టాయ్ 'అన్నా క్రేనినా' యొక్క అంతం నా నేత్రాలముందు నాట్యం చేస్తుంది. నేను దానిని మరచిపోవాలనుకొన్నా, మరపు రావడం లేదు.

యోగ :- (నిరాశతో) నీ యిష్టం జేసీ ! నిన్ను బలవంత పెట్టను. వెళ్ళు. భగవంతుడు నిన్ను రక్షించుగాక ! అప్పుడప్పుడు నన్ను జ్ఞాపకంచేసుకో......ఉమ చనిపోయింది, ఆమె యింక తిరిగి రాదని ఈరోజు నాకు తెలిసింది.

( ఏడవ నారంభిస్తాడు. తర్వాత తనకు తాను ధైర్యం తెచ్చుకొని )

ఈ ఆఘాతాన్ని నేను సహించలేను జేసీ; కాని, నువ్వు వెళ్ళి సుఖంగా వుండు.

జేసీ :- మీ వివాహానికి నన్ను తప్పక పిలవాలి.

యోగ :- త్వరలోనే అవుతుంది జేనీ ! విని, నువ్వే స్వయంగా వస్తావు.

జేనీ :- అవును. నేను స్వయంగానే వస్తాను. కాని, కనీసం తెలియపరిస్తే చాలు.

( ఆభూషణాల పెట్టెను ఎత్తి )

ఈ ఆభూషణాలు, ఆ సౌభాగ్యవతికి నా తరఫునుండి బహూకరించండి.

యోగ :- (పెట్టె తీసుకొని) ధన్యవాదాలు.

( లేచి, తల వంచుకొని, నెమ్మది నెమ్మదిగా గది బయటికి వెళ్ళిపోతాడు. జేనీ ఒక్కక్షణం అతన్ని చూస్తూ వుంటుంది. తర్వాత అశ్రుపూరిత నేత్రాలతో తన సామాను సర్దుతుంటుంది. )

( తెర )

# ఏడవ దృశ్యం

(జేనీ యిల్లు. మిసెస్ గార్డన్ కోళ్ళకు ఆహారం వేస్తుంటుంది.)

విలియం :- మిసెస్ గార్డన్! జేనీ దగ్గరనుంచి ఏదైనా ఉత్తరం వచ్చిందా?

మిసెస్ గార్డన్ :- ఆఁ, ఆమె ఒకటి రెండురోజుల్లో వస్తుంది.

విలియం :- కాని, ఆమె నాకింక చెందదు మిసెస్ గార్డన్! నేను వున్నవాడిలాగే వుంటాను. అన్ని ప్రయత్నాలు చేసి చూశాను. ఆమె నాకు సాధ్యంకాదు. అదీగాక యిప్పుడామె నెలకు వెయ్యిరూపాయిలు సంపాదిస్తున్నది. నామూడు వందలు ఆమె దృష్టికి నచ్చవు. ఇప్పుడామె నన్ను వివాహం చేసుకోదలచుకొన్నా, చేసుకోను.

మిసెస్ గార్డన్ :- నిజంగానా? అసలు ఆమెమీద కోపమెందుకు? ఆమె వెయ్యిలో, నీ మూడువందలు కలిపితే, పదమూడు వందలవుతాయి. ఈ మాత్రం లెక్కకూడ తెలియదా?

విలియం :- కాని, యింట్లో నాపొజిషన్ ఏముంటుంది? నా భార్య దృష్టిలో నీచంగా వుండటం నాకిష్టం లేదు. ఆమె మాత్రం నాకు అణగి ఎందుకుంటుంది? నన్నెందుకు గౌరవి

స్తుంది? భార్య సంపాదనతింటున్నాడని, భార్య సంపాదనతో 'జల్సా' చేస్తున్నాడని ప్రజలంతా అనుకొంటారు.

మిసెస్ గార్డన్ :- (చిరునవ్వు నవ్వి) యిందులో నష్టమేముంది? స్త్రీ, పురుషుని సంపాదన తింటూ, ఆ ఆర్జనమీద అట్టహాసం చేస్తున్నప్పుడు ఏమాత్రం సిగ్గుపడదు.

విలియం :- మీకు యింకెలా నచ్చచెప్పను? పురుషుడు పురుషుడే, స్త్రీ స్త్రీయే.

మిసెస్ గార్డన్ :- ఓహో! ఈరోజు నాకు ఈ క్రొత్త విషయం తెలిసింది. పురుషుడు స్త్రీ అని, స్త్రీ పురుషుడని అనుకొనేదానిని.

విలియం :- మీరు హేళన చేస్తున్నారు. నా హృదయంలోవున్న భావాల్ని చెప్పడానికి నా దగ్గర శబ్దాలు లేవు. స్త్రీ, తననే ఆశించుకొని వుండాలని, అవసరమైన వస్తువును తననే అడగాలని, తనను గౌరవించాలని, సత్కరించాలని, పురుషుడు అనుకొంటాడు. అందుకే పురుషుడు రాత్రింబవళ్లు హృదయాన్ని బ్రద్దలుకొట్టుకొని కష్టపడతాడు; కేవలం స్త్రీ దృష్టిలో తనగౌరవం నిలచివుండటానికే—మోసం, మాయ, కపటం - అన్నీ చేస్తుంటాడు. స్త్రీనుండి వీలయినంత ఆదరం పొందగలగాలని, సాధ్యమయినంత విశ్రాంతిని తీసుకోగలగాలనే పురుషుని ముఖ్యాశయం. పురుషుడు స్త్రీ కోసమే బ్రతుకుతున్నాడు, స్త్రీకోసమే చనిపోతున్నాడు; ఆమెకోసం ఆహుతవ్వాలనుకొంటాడు. కాని, స్త్రీయే పురుషునికంటె

ఎక్కువ సంపాదిస్తుంటే, యిక ఆమెదృష్టిలో పురుషుని విలువే ముంటుంది ?

మిసెస్ గార్డన్ :- ఓహో ! ఇదా నీ వుద్దేశం ! కాని, ఎక్కువగా పురుషులు, సంపదగల స్త్రీలనే వెదకడంచూశాను నేను.

విలియం :- అటువంటి పురుషులు సిగ్గులేనివారు మిసెస్ గార్డన్ ! వాళ్ళు లజ్జాహీనులు. వాళ్ళు ఎప్పుడూ స్త్రీని ఆశిస్తారు, ఆమెను పొగుడుతుంటారు, ఆమెమాట ననుసరించి నడుస్తుంటారు. స్త్రీ వాళ్ళమీద అధికారంసాగిస్తుంది, చెవి పట్టుకొని లేవదీస్తుంది, కూర్చోబెడుతుంది. నేనీ అవమానాన్ని సహించలేను.

మిసెస్‌గార్డన్ :- ఆడదాని డబ్బుతో ఆనందాన్ని అనుభవిస్తూ, అట్టహాసంచేసే పురుషుల్ని ఎంతోమందిని చూశాను నేను.

విలియం :- అటువంటి వాళ్ళు అదృష్టవంతులు. నేను ఆ అదృష్టవంతులలోని వాడినికాను. వారిలో జాతిగౌరవమో, సౌందర్యాకర్షణో, విద్యా గౌరవమో వుండొచ్చు. నాలో ఏగౌరవమూ లేదు. నేనొక అమాయక బీదకూలీని. జేనీకోసం ఆశించడం నా మూర్ఖత్వం. నిజంగా నే నామెకు యోగ్యుణ్ణి కాను.

మిసెస్ గార్డన్ :- ఆమె నీకంటె ఎక్కువ సంపాదిస్తుందనేనా ?

విలియం :- అవును ప్రియమైన మిసెస్ గార్డన్! నా తప్పును తెలుసుకొన్నాను. ఈ మధ్య మరొకవిషయం కూడ గమనించాను. నన్ను హేళని చేయకండి. నాకంటె ఎక్కువ అనుభవం, తీక్షబుద్ధి, మంచిధైర్యం కలిగి, తన సలహాలతో నాకు సహాయ పడుతూవుండే జీవితసహచరిణి కావాలి నాకు, అటువంటి స్త్రీనే విశ్వసించగలను. మీలో ఈ అన్నిగుణాలు వున్నాయి. (భూమిమీదమోకరించి) నేను మీతో ప్రొపోజ్ చేస్తున్నాను. మిసెస్ గార్డన్! భగవంతుని ముఖంచూసి నిరాకరించకండి. జీవితానందానికి, రూప యౌవ్వనాలకంటే, అనుభవం, సేవాభావమే చాల అవసరమని యిప్పుడు నాకర్థమయింది. రూపవంతురాలయిన యువతి నాలో కొన్ని వేలలోపాల్ని చూస్తుంది. ఆమె తనతోపాటు, అనుమానాన్ని, ఈర్ష్యను తెస్తుంది. నేనామెకు కాపలా కాయవలసి వస్తుంది. ఆమె ఎవరితో మాట్లాడుతుందో, ఎవరితో నవ్వుతుందో, ఎక్కడకు వెళుతుందో - ప్రతివిషయాన్ని గమనించ వలసి వుంటుంది. ఈ గొడవ నాకు నచ్చదు. మీయందు నాకు పూర్ణవిశ్వాసముంది. మీరునాకు ద్రోహం చేయలేరు.

మిసెస్ గార్డన్ :- (గర్వోన్మత్తతో) బాగాఆలోచించు విలియం! లోకం ఏమంటుంది? ఈ స్త్రీకి వృద్ధాప్యంలో కామం పుట్టిందనదూ? ఇలా చెయ్యదలచుకొంటే, మూడు సంవత్సరాలక్రితమే ఎందుకు చెయ్యలేదు? అప్పుడు నేనింతగా ముసలిదానినికాను. బహుశా నిన్ను కొంచెం అధికంగా సంతోషపెట్టేదానిని.

విలియం :- అందుకే నేనూ విచారిస్తున్నాను.

మిసెస్ గార్డన్ :- సరే! నామీద అధికారం చలాయించవు కదూ ?

విలియం :- ఊహుఁ, భగవంతుని మీద ఒట్టు. నేను మీ ఆజ్ఞ లేకుండా ఒక్క అడుగుకూడ కదపను.

(మిసెస్ గార్డన్, విలియంను హృదయానికి హత్తుకొంటుంది.)

మిసెస్ గార్డన్ :- నువ్వు ఏమోసగత్తెవలలోనో చిక్కుకొంటావని, నేనుచాల అనుమానించాను. నీ సరళ స్వభావం, నిష్కపటం, అమాయకత్వం చూసి, మొదటినుంచీ నాకు భయంగానే వుండేది. అందుకే నిన్ను జేసీతో కలుపుతుండేదానిని. జేసీలో ఎన్ని లోపాలున్నా చంచలత్వం లేదు. ప్రియమైన విలియం! నీకు జ్ఞాపకం వుందా? మనం మొట్ట మొదట పార్కులో కలుసుకొన్నాం. నేను చెర్చినుంచి వస్తున్నాను, ఆ రోజే నువ్వు నా హృదయంలో స్థానాన్ని ఏర్పరచుకొన్నావు. ఈ పక్షి ఏదోరోజున నీ పంజరంలోకే వస్తుందని, నా హృదయం ఆ రోజునే చెప్పింది. ఆ సౌభాగ్యం ఈనాడు నాకు లభించింది. పద, మనమిద్దరం చెర్చిలో భగవంతుని ప్రార్థిద్దాం.

( తెర )

# ఎనిమిదవ దృశ్యం

(జేసీ విశాల భవనం. జేసీ ఒక నీడగల వృక్షం క్రింద కుర్చీలో కూర్చొని ఆలోచిస్తుంటుంది.)

జేసీ :_ (స్వగతం లేక అంతర్వాణి) మనస్సు చంచల మయిందని విద్వాంసులన్నారు. కాని, నా అనుభవంలో దీని కన్న స్థిరమైనది, ప్రపంచంలో మరొకటి కన్పించడంలేదు. *రజన్‌ను మరచిపోవాలని ఎంతో ప్రయత్నించాను; కాని, ఆయనకు దూరంగా వుండేకొలది, కఠోరమైన పాశాల్లో తగులుకొంటున్నట్లుంది. పియానోమీద కూర్చొని ఎన్నో నెలలయింది. హృదయం మృతిజెందినట్లుంది. ఆ ఆకారమే నేత్రాల్లో తిరుగుతుంది, ఆమాటలే చెవుల్లో ధ్వనిస్తున్నాయి. రజన్‌కంటె రూపవంతులు, విద్యావంతులు వున్నారు; కాని, ఎవరితోను మాట్లాడటానికి మనస్కరించదు. నేను కొంచెం ధైర్యమిస్తే నాకోసం ప్రాణాలిస్తారు. తృష్ణాపూరిత మోహిత నేత్రాలతో నావంక చూస్తారు. ఒక్కమాట మాట్లాడితే, ఎంతో ఆనందిస్తారు. కాని, ఆ దేవతముందు వీరంతా ఆట బొమ్మలు. ఆటబొమ్మల్లో రూపు, రంగు, కళ దేవతలోకంటె చాల ఎక్కువగా వుంటాయి; కాని, దేవతయందు శ్రద్ధ, ప్రేమ ఉత్పన్నమవుతుంటుంది, ఆటబొమ్మలయందు కేవలం వినోద భావమే వుంటుంది. అదేమిటి? ప్రియమైన రజన్! నువ్వు నామీద ఏ ఇంద్రజాలాన్ని ప్రయోగించావు?

---

*యోగరాజు

(మిసెస్ విలియం వస్తుంది.)

మిసెస్ విలియం :- నువ్విక్కడ ఎంత సేపు కూర్చొని వుంటావు జేనీ! మంచుకూడ పడుతుంది !

జేనీ :- గదిలో నాకు వూపిరాడదమ్మా!

మిసెస్ విలియం :- మంచిఫలహారం తయారుచేశాను. పద, కొంచెంతిందువుగాని. పగలంతా ఏమీతినలేదు; కొంచెం అద్దంలో నీ ఆకారాన్ని చూసుకో – ఆరునెలల రోగిలా వున్నావు.

జేనీ :- ఇంకా తినాలని లేదమ్మా! క్షమించండి. చాల రోజులనుంచి రజన్ దగ్గరనుంచి ఉత్తరం రాలేదు. నా గుండె అదురుతోంది. పగవారికైనా భగవంతుడు చల్లగాచూడాలి.

మిసెస్ విలియం :- నీ పరిస్థితి యిలావున్నప్పుడు రజన్ను ఎందుకు వివాహం చేసుకోవు? పాపం, అతను అన్నిటికి ఒప్పుకొన్నాడు; కాని, నీలోపం పిచ్చిప్రవృత్తి వ్యాపించిందో అర్థంకాదు. నువ్వుబాధపడుతుండటమే కాకుండా, ఆ అమాయకుణ్ణికూడ ఏడిపిస్తున్నావు. ధర్మబంధాలలో సంబధం లేనప్పుడు – ఏసుప్రభువును విశ్వసించమని అతనితో ఎందుకు చెప్పకూడదు? ప్రేమోద్దేశము జీవిత సుఖమా? కాలమంతా విలపించడమా?

జేనీ :- ఇదే నేనూ ఆలోచిస్తున్నాను మమ్మా! నేను శుద్ధిచేసుకొంటే నష్టమేమిటి? నాలో ఏమీ మార్పురాదు. కాని, ఆయన సమాజాన్ని సంతోషపెట్టవచ్చు. ఆయన హృదయం యింత కోమలమైనదని తెలిస్తే, విడిచి వచ్చేదానిని

కాదు. నా మొండితనానికి పశ్చాత్తాపం కలుగుతోంది. ధర్మం, సిద్ధాంతం మనుష్యులకోసమే. మనుషులు వాటికొరకు కారు. మమ్మీ! నా బాధ నీకేమని చెప్పను? రెక్కలువుంటే, యిప్పుడే ఎగిరివెళ్ళి—"డార్లింగ్! నన్ను క్షమించు" అందా మనిపిస్తోంది. ఈ మూడు నెలలు నేనెలా గడిపానో, నువ్వు చూశావు; కాని, నాహృదయంలోని తుఫాను ఎవరికి తెలుస్తుంది? ఒక్కక్షణంకూడ ఆయన స్వరూపం నేత్రాలనుండి తొలగటంలేదు. ప్రేమకోసం తమ సర్వస్వాన్ని అర్పించేవారు ప్రపంచంలో వుంటారని, ఆయన్ను చూసినతర్వాత అనుకొన్నాను. నాకు స్వర్గసౌఖ్యం దొరుకుతుండేది మమ్మీ! కాని, సమాజానికి భయపడి దానిని నిరాకరించాను. నేను వెళ్ళిపోయిన తర్వాత, ఆయన భోగ విలాసాల్లో మునిగి, ఏ యువతినో వివాహంచేసుకొని, జీవితం సుఖమయం చేసుకొంటారనుకొన్నాను మమ్మీ! నా వియోగంలో విలపిస్తారనుకోలేదు. రేపు ఆయన దగ్గరనుంచి ఉత్తరం రాకపోతే, నేను వెళతాను మమ్మీ! అప్పుడు మీ గురించే నేను ఆలోచించే దానిని మమ్మీ! ఆయన్ను వివాహంచేసుకొంటే, మీరు విషం తింటారేమోనని భయపడ్డాను. ఇప్పుడు మీ విషయంలో కూడ నిశ్చితంగా వున్నాను.

మిసెస్ విలియం :- విలియంను వివాహం చేసుకోగానే నా మనస్సులో నీయందు ప్రేమ వుండదనుకొన్నావా?

జేనీ :- అదికాదు మమ్మీ! కనీసం మిమ్మల్ని రక్షిస్తూ వుండటానికి ఒకవ్యక్తివున్నాడు.

మిసెస్ విలియం :- విలియం నా వెనుకపడి ప్రాణాలు యివ్వడానికి సిద్ధపడ్డాడు; లేకపోతే ఈ వయస్సులో నాకు భర్తృవుండాలనే కోరికే లేదు.

జేనీ :- అయితే అందుకు మిమ్మల్ని నేనేమీ అనడం లేదు మమ్మీ ! విలియంలో ఒకటి రెండు లోపాలున్నా, వేల కొలది మంచిగుణాలున్నాయి. ఆయన సన్నిహిత పరిచయాన్ని పొందేకొలది, ఆయనయందు, నాకు శ్రద్ధాభావం అభివృద్ధి అవుతోంది. ఆయన నిజంగా మీకు యోగ్యులు మమ్మీ !

( టెలిగ్రాం బంట్రోతు టెలిగ్రాం తెస్తాడు. జేనీ వెలవెల పోతుంది. కంపిత హస్తాలతో తీసుకొని చదవగానే స్పృహతప్పి పడిపోతుంది—— )

"Yogaraj breathed his last with Jenney's name on his lips to the last moment."

మిసెస్ విలియం :- ఓ భగవంతుడా ! ఓ ప్రభూ ! ఏమి అన్యాయం చేశావు ?

(జేనీ హృదయంమీద చేయివేస్తుంది. వెంటనే కంగారుగా లోపలకెళ్ళి గులాబి నీళ్ళు తెచ్చి జేనీ ముఖంమీద చిలకరిస్తుంది. దగ్గరలో విసనకర్ర లేక పోవడంవలన, జేనీ చదివి కుర్చీక్రింద పెట్టిన పత్రికతో విసరుతూ, మధ్య మధ్యలో భగవంతుని స్మరిస్తూ, విలియం వస్తూంటాడేమోనని నిరీక్షా నేత్రాలతో

గుమ్మంవంక చూస్తూంటుంది. ఒక నిముషం గడచేక జేనీ స్పృహలోకి వస్తుంది. )

జేనీ :_ నాకేమీ భయంలేదు మమ్మీ ! నువ్వేమీ కంగారు పడకు. ఏమయిందో అర్థంకాదు; హృదయం ఆగి పోయినట్లయింది. యిప్పుడు బాగానేవుంది. ఇలా అవుతుందనే భయం నాకు మొదటినుంచీ వుంది. నేను అక్కడనుంచి వచ్చేటప్పుడే, ఆయన పరిస్థితి చూచి అనుమానం కలిగింది; కాని, మగవారు—నాలుగైదు రోజుల్లో మార్పు కలుగుతుం దనుకొన్నాను. ఇలా అవుతుందని ఏం తెలుసు ?

( ఒక క్షణంలో ఆమె నేత్రాలు మళ్ళీ చంచల మవుతాయి. హిస్టీరియాలా వుంటుంది. )

ఆయన చనిపోయారని ఎవరంటున్నారు ? శుద్ధ అబద్ధం. ఆయన నాముందు వున్నారు. నానేత్రాల్లోవున్నారు. నాహృదయంలో వున్నారు. అలాగే నిలబడి ప్రేమమయ నేత్రాలతో నన్ను చూస్తున్నారు. కొంచెం ఆయన కొంటె తనం చూడు మమ్మీ, తెరచాటున దాగి నన్ను మోస గిస్తున్నారు. ఇక చాలించండి. నే నిలా మోసపోను.

( తటాలున లేచి గదివైపుకు వెళుతుంది. తల్లి కూడ వెనుకనే వెళుతుంది. జేనీ మేజామీదనున్న యోగరాజు ఫొటోనుతీసి, హృదయానికి హత్తుకొని ముద్దు పెట్టుకొంటుంది. )

మిసెస్ విలియం :- జేసీ ! భగవంతుని ముఖంచూచి, హృదయాన్ని దిట్టపరచుకో.

జేసీ :_ హృదయాన్ని దిట్టపరచుకొంటే, ఏమవుతుంది మమ్మీ. ఇప్పుడది ఎందుకు పనికొస్తుంది. అసలు అది నా దగ్గర వుంటేగా ! అది రజన్‌తో వెళ్ళింది. లేకపోతే, నే నిలా కూర్చొని వుంటానా ? రజన్ చనిపోతే నే నిలా కూర్చొని వుంటానా ? హాఁ ! నే నిలా కూర్చొనివుంటానా! నేత్రాలనుంచి నెత్తురు కారేది, నా శవం భూమిమీద పడేది. కాని, నా కేమీ కానట్లు నే నిక్కడే కూర్చొని వున్నాను.

( ఆ ఫోటోను మేజామీద పెట్టి, ఒక ముఖమల్ కేసులోవుంచిన యోగరాజు ఉత్తరాలు తీస్తుంది. )

నా మంచి మమ్మీ ! కొంచెం కూర్చో. ఆయన ఉత్తరాలు వినిపిస్తాను—' నమ్మకంలేని నా జేసీ !' నన్ను 'నమ్మకంలేని' అని ఎందుకన్నారో అని అప్పుడు ఆయన మీద చాల కోపం వచ్చింది; కాని ఆయన నన్ను బాగా గుర్తించారని యిప్పు డర్థమయింది. నమ్మకం లేని దాననూ కాదా నేను—అయన్ను అక్కడ విడచి వచ్చాను. నేను నమ్మకం లేని దానిని, బాధ లేని దానిని, మోసగత్తెను. అయ్యో! ఈ తిట్లు ఎంత తియ్యగా వున్నాయి! అప్పు డాయనతో ఈ ఆక్షేపణను ఒప్పుకోనని బెదరించాను. ఈరోజు రజన్ యొక్క ఆ శబ్దాలు ఎంత మధురంగా, ఎంత మర్మంగా కనుపిస్తున్నాయి ! ఇప్పుడు నన్నెవరు 'నమ్మకం లేని దాని'

వంటారు? ఎవరు 'బాధ లేని దాని' వంటారు? ఎవరు 'మోసగత్తె' వంటారు? ఇప్పుడు ఎవరిని మోసగించను? మమ్మీ చెప్పు. ఎలా హృదయాన్ని దిట్టపరచుకోను? ఎలా ఈ అభాగ్యురాలికి నచ్చ జెప్పను?

(తలవెంట్రుకలు పీక్కొంటుంది. మిసెస్ విలియం!
ఆమెను హృదయానికి హత్తుకొంటుంది.)

మిసెస్ విలియం :- అమ్మా, జేనీ! నా తల్లీ!!

జేనీ :- మమ్మీ! ఆయన్ను విడచి నేనిక్కడ కెందుకు వచ్చానో మరచి పోతున్నాను. అసలు జ్ఞాపకమే రావడం లేదు. ఇక్కడ కెందుకొచ్చాను నేను? నేనాయన నెందుకు హత్యచేశాను? ఆఁ, జ్ఞాపకం వచ్చింది. ఆయన ధర్మాన్ని, కులమర్యాదను రక్షించడానికి, నా ధర్మాన్ని, కులమర్యాదను రక్షించుకోడానికి. ఈ అనర్థాన్ని ఆలోచించు! నా ప్రాణాల్ని ఆయన చరణాలకు అంకితం చేయాలని నా జీవిత ముఖ్యకోరిక. కాని, ఈచేతులతోనే ఆయనను హత్యచేశాను. నేనుకాదు - నా ధర్మం హత్యచేసింది. ఈ విభిన్న మతాల్ని సృష్టించి, ప్రజలు ప్రపంచంలో ఎంత విషాన్ని వ్యాపింప జేశారో, ఎంత అగ్నిని రగుల్గొల్పారో, ఎంత ద్వేషాన్ని పెంచారో! మానవుల్ని వేర్వేరు గుంపులుగా తయారుచేసి, వారిలో భేదభావాల్ని నింపడానికేనా మతం సృష్టించబడింది? ఇటువంటి ధర్మం దోపిడిగాళ్ళది కావచ్చు, స్వార్థపరుల్ది

కావచ్చు, మూర్ఖులది కావచ్చు; కాని, భగవంతునిదిమాత్రం కాదు.

మిసెస్ విలియం :- అమ్మా ! భగవంతుడు ధర్మాన్ని సృష్టించకపోతే, ఈ పాటికే ప్రపంచం నాశనమయిపోయేది. మానవులు, మానవుల్నే తినేసేవారు; బైబిలు భగవంతుని పవిత్ర వచనం.

జేనీ :- భగవంతునివన్నీ పవిత్రి వచనాలే; కాని, ఆ పవిత్ర వచనాలు ప్రపంచానికి ఏం వుపకారంచేశాయి, మనిషి యొక్క మానవత్వాన్ని ఎంతవరకు బాగుపరచాయి ? ఈ రోజు ధనం మానవరక్తాన్ని ప్రవహింపజేస్తున్న దానికంటే కూడ; ధర్మం కఠిన హృదయంతో మానవరక్తాన్ని పిండుతూ వుంది. ధనం యింతనిర్దయతో, యింత కఠోరంగా వుండదు. ధనం తన ఆశననుసరించి పనిచేస్తుంది; కాని, ధర్మం ప్రేమ సందేశాన్ని తీసుకొచ్చి, మనుష్యుల గొంతు పిసుకుతుంది. అది, మానవుల మధ్య దాటడానికి సాధ్యం కాని గోడను నిర్మిస్తుంది. అసలు విశ్వమంతా ఒకే ఆత్మ. ఈ ధర్మభేదం ఐక్య ఆత్మను విడగొట్టగలదా ? ప్రతి అణువులోను ప్రతిబింబించే భగవంతుని, మనం చెర్చిలోను, మసీదులోను, మందిరంలోను బంధించి, ఒకరినొకరం నాస్తికులని, నీచులని అనుకొంటాము. ఆవిశ్వ ఆత్మకు ఈ గోడవలతో ఏం సంబధం ? నువ్వు చెర్చికి వెళుతున్నావో, మసీదుకు వెళుతున్నావో దానికేం కావాలి ? నువ్వు ప్రేమతో వుంటున్నావా లేదా అని మాత్రమే అది చూస్తుంది. దాని నిర్మల ప్రవాహానికి అనకట్టకట్టి, ప్రకృతి

నియమాలను ఉల్లంఘించినవారికి తప్పక శిక్షపడుతుంది. మనం ఆ శిక్షను అనుభవిస్తున్నప్పటికీ, మనకళ్లు తెరుచుకోవడంలేదు. ఆ విశ్వఆత్మను, ఆ చైతన్యవ్యాప్తిని, తునకలుచేసి పంచడానికి మానవునకు శక్తి వుందా ? ఎప్పటికిలేదు. యిది ధర్మమే కాదు.

మిసెస్ విలియం :- భగవంతుడు కేవలం మన ప్రవక్తను పంపేడు.

జేనీ :- భగవంతు ఏ ప్రవక్తనూ పంపలేదు మమ్మీ ! మన ధర్మాలన్నీ పాడయిన సమాజాన్ని బాగుపరచడానికి వుపాయలు; కాని, ధర్మాలమీద భగవంతుని ఒత్తిడి వుండటంవలన, వారు బాగుపరచడానికి వచ్చి, పాడుచేసి వెళుతున్నారు. మానవులు గుహాలలో నివసించే కాలంలో, క్రూర మృగాలనుండి, తమజాతియొక్క యితర గుంపులనుండి, తమను రక్షించుకోడానికి సంఘంగా తయారయి వుండేవారు. ప్రస్తుతపు మతాలన్నీకూడా అటువంటివే ! ఆరాతియుగపు అలవాట్లను వదులుకోలేకపోవడం మానవజాతి కొక మహాశాపంగా పరిణమించింది. 'నబీ' వచ్చాడు, 'అలీ' వచ్చాడు, 'అవతారాలు' వచ్చాయి, భగవంతుడు స్వయంగా వచ్చాడు, ఎన్నోసార్లు వచ్చాడు. ఫలితం ఏం జరిగింది ? యుద్ధాలు, హత్యలు ! వర్ణభేదం, జాతిభేదం - అన్ని భేదాల్ని నశింపజేయడానికి కంకణం కట్టుకొంది ధర్మం; కాని—అన్ని భేదాలకన్న కఠోరంగా అదే స్వయంగా భేదాలకు కారణమయింది. నేను నీ బిడ్డను, నీ హృదయ రక్తాన్ని నాకు

త్రాగించి పెంచేవు. నాకంటె ప్రియమైన వస్తువు నీకు ఈ ప్రపంచంలో లేదని నేనెరుగుదును; నేనీ రోజు చర్చికి వెళ్ళడం మాని, మసీదుకు వెళితే నువ్వు నా ముఖం చూడ్డానికి యిష్టపడవు. నన్ను నీచేతులతోనే చంపవచ్చునుకూడ. నేను నువ్వు ఒకటే, యిక ఈ ద్వేషం ఎక్కడనుంచివచ్చింది ? ఇది మన మనస్సుల్ని సంకుచితంచేసిన ధర్మంయొక్క మహాప్రసాదమని నా ఉద్దేశం.

మిసెస్ విలియం :- నువ్వు నన్నింత ధర్మాంధురాలిగా భావిస్తున్నావా అమ్మా ! నాకు తప్పకుండా దుఃఖం కలుగవచ్చు, అయినా నీ ముక్తికోసం భగవంతుని ప్రార్థిస్తా; కాని, నీకు అనర్థం చేయలేను, ఎన్నటికీకూడ.

( జేనీ తల్లిని కౌగిలించుకొని ముద్దు పెట్టుకొంటుంది. )

జేనీ :- మమ్మీ ! నీకు భగవంతుడు స్వర్గంలో స్థానం యివ్వాలి. నువ్వు నా హృదయభారాన్ని తేలిక పరచావు. ఇప్పుడు నాకు అనుమానం- బాధ ఏమీలేదు. ఈ రోజు నేను సమస్త ఆడంబరాల్ని, సమస్త కృత్రిమ బంధనాల్ని ప్రేమ పీఠానికి అంకితం చేస్తున్నాను. ఇదే భగవంతుని ధర్మం. ధన ధర్మంలోను, విద్యా ధర్మంలోను, దేశ ధర్మంలోను సంఘర్షణ రాగలదు. భగవంతుని ధర్మం ప్రేమ. ఈ ధర్మాన్నే నేను స్వీకరిస్తున్నాను; మిగిలిన దంతా మోసం. త్వరగా కారు తెప్పించండి. రైలు రాత్రి రెండు గంటలకు

వెళుతుంది. అంతవరకు నేను నిరీక్షించలేను. కారు మీద వెళతాను. ఉదయానికి చేరుకొంటాను. అక్కడే ప్రభాత శుభ ముహూర్తంలో హోమగుండం చుట్టూ తిరుగుతూ వుండగా, శ్లోకాలు, మంత్రాలతో అట్టహాసంగా, రజన్‌తో నా వివాహ మవుతుంది. నాకు 'ఆల్టర్', 'హోమగుండా' లలో భేదం లేదు. జీవితమంతా ఈ వ్రతాన్ని నిర్వర్తించే టట్లు శక్తి ప్రసాదించు భగవంతుడా! పరమ పితా! నాకు బలము ప్రసాదించు, ధైర్యం ప్రసాదించు, బుద్ధిని ప్రసాదించు.

( ౪౦ )

సమాప్తం.

82

ప్రేమ్ చంద్

# నిర్మల

కరుణారసభరితమైన జీవితగాథ

ఇందు

గృహజీవితంలో అకారణమైన అనుమానాలకు తావిచ్చేవారు

సంసారాలను ఎలా నాశనంచేసుకొంటారో

అతిరసవత్తరంగా వివరించారు

శ్రీ ప్రేమ్ చంద్.

బాల బాలికలు, స్త్రీ పురుషులు, వయోవృద్ధులు యావన్మంది

చదివి గ్రహించవలసిన విషయాలెన్నో ఉన్నాయిందులో.

హిందీలో ఈనవల సుమారు లక్ష ప్రతులు

ఖర్చయినవంటే

దీని ప్రాముఖ్యతను గురించి వేరే చెప్పనక్కరలేదు.

నేడే మీ ప్రతిని రిజర్వు చేసుకొనండి.

**ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విజయవాడ.**

త్వరలో మేము ప్రచురించబోవు ప్రేమ్‌చంద్ యితరరచనలు

1. నారీ జీవన్ కీ కహానియాఁ (ఉత్కృష్టమైన కథల సంపుటి)

2. కర్బలా 3. సంగ్రామ్

ఇంకా ఇంకా

